# తల్లి వైద్యము

(తరగని - మందులపెట్టె)

## ఆరోగ్యానికి - తల్లి ఆదేశము

1. ఊహాలలో - శాంతి

2. మాటలలో - ఆనందం

3. చేష్టలలో - అహింస

## PRAYER

God is my health,
I can't be sick ;
God is my strength, unfailing, quick ;
God is my all, I know no fear,
Since God and Love and Truth are here.


=డాక్టర్ ఉప్పులూరి పట్టాభిరామయ్య,

జీవసాధన వ్యాయామ కళాశాల,

ఏలూరు.




Rs. 1-8-0.

# అంకితము

—(౦)—

పూర్వము విజ్ఞాన వికాసాలకు వినయ విధేయతలకు
ఆరోగ్య గౌరవముల పెంపుదలకు ఆధార భూతులై,
నేడు యింటిలో జబ్బు చేసిన ఏమియు చేయ
జాలని వనితా లోకమునకు

# విజ్ఞప్తి

తల్లి వైద్యము ప్రతియింట నుండవలసిన గ్రంథము. ఆదిని వైద్యమనునది మన చుట్టునున్న మొక్కలతోనే మన యింటిలోని వస్తువులతోనే ప్రారంభమాయెను. ఇంటిలోని వాము, మిరియము, దొడ్డిలోని వేపతో చాలవరకు రోగములను యింటిలోని తల్లియే కుదర్చి వీలగును. ఈ సూత్రమును పాటించియే యింటిలోను యింటి ప్రక్కల దొరకు వస్తువులతో మాత్రమే అక్షర నిఘంటువుగ చాల రోగములకు అనుభవ చికిత్సలను వ్రాసి యిందు యిమిడ్చి యుంటిని, ఇది మూలికా వైద్యము కాదు. వీటిని వాడునపుడు "Avoid extremes" అతిసర్వత్ర వర్జయేత్ సకల ధర్మార్థ సుఖముల నాచరించునపుడు "సర్వధర్మేషు మధ్యమాం" అని వాగ్భటుడు నుడివి యున్నాడు. ఇందుగల చికిత్సలు సాత్వికమగుటచే వాడుటలో హెచ్చు తగ్గులున్నను అపాయము గలుగదు. ఒక దాని వలన ఒకటి రెండు రోజులలో లాభము కనబడనిచో మరియొక దానిని మార్చి వాడనగును.

నీతి నియమముల పాటించుట వలన ఆత్మ బలమును, ప్రాతఃకాలముననే నిద్రలేచి "జీవ సాధన వ్యాయామము" చేసి, చన్నీళ్ళ స్నానముచేసి, ప్రకృతికి ఎక్కువ దూరము గాకుండ నుండు ఆహార మనో నియమముల వలన యోగత్వమును భోగత్వమును బొందగలము. విశ్రాంతి, ఉపవాసముల వలన శారీరక మానసిక ఉద్రేకములు తగ్గి ఆరోగ్యము గల్గును. సత్సాంగత్యము వలన సత్సంకల్పములు పుట్టును స్వధర్మ బద్ధమైన బ్రహ్మచర్యము వలన మానవుని శక్తిసామర్థ్యములు వికసించును. ఆశను పురికొల్పు ఆనందమును హెచ్చించవలయును, "ఆచారః పరమోధర్మః" అని మనువు

నుడివియున్నాడు. అనాచారమువలన అనేక రోగములు పుట్టును. అధర్మాచరణమువలన సర్వజన సర్వాంనక వ్యాధులు కలుగునని చరకుడు చెప్పియున్నాడు. నవీన వైద్య శాస్త్రము లన్నియు దానినే ఘోషించుచున్నవి.

హింస, ద్రోహతనము, విపరీత కోరిక, కాముకత్వము, పరుషవాక్యములను పలుకుట, అసత్యము, అసంబద్ధ ప్రలాపము, ద్రోహచింత లేక వ్యభిచారదృష్టి, వ్యర్థమగు ఆలోచన లేక చింత, వ్యత్యాసదృష్టి యీ శతవిధ పాపములను విడువవలెను.

తల్లి ప్రవచనములు:— "1. మంచి ఆలోచనలు, 2. మంచి మాటలు, 3. మంచి పనులు". మరువకుము. కీడు అంటుడు రోగమువలె ప్రబలుచున్న సోమరితనమును రూపుమాప ప్రయత్నించుడు.

ఎవరికి వారు యీ చికిత్సల చేసికొనుట కంటె యితరులు చేయుట వలన వాటియందు నమ్మకము హెచ్చును. చేయువారలకు పరోపకార బుద్ధియు; సోమరితనము లేకుండుటయు గలుగును.

ఈ పొత్తమును అచ్చొత్తించక సంవత్సరములు ఊరక నున్నతరి మామిత్రులును, కాపునాయకుడును, దీనజన పోషకుడును, యోజనకారియు, నిదానియు, అదృష్టవంతుడును నగు శ్రీయుత పుప్పాల గోపాలంగారి పుత్రులు, రామమూర్తి నాయుడుగారు నాకు తగు ప్రోత్సాహమును జూపినందులకు నా కృతజ్ఞతను దెలుపుచున్నాను.

వారికిని వారి కుటుంబమునకును మా ఆశీర్వచనములు.

గ్రంథకర్త.



రాజ పోషకులు:- "జీవసాధన గ్రంథమాల"
శ్రీ పుప్పాల రామమూర్తి నాయుడు గారు.
పూళ్ల (మల్కీ- మహమ్మద్‌పురం).



గ్రంథకర్త :
డాక్టరు ఉప్పులూరి పట్టాభిరామయ్య గారు,
జీవసాధన వ్యాయామ కళాశాల
ఏలూరు.

# తల్లి వైద్యము.



## అజీర్ణము

1. అల్లపురసము, తేనె సమ భాగములు కలిపి పుచ్చుకొనిన మంచిది.

2. వాము ఉప్పు కలిపి పరగడుపున పుచ్చుకొనవలెను.

3. ఎండు మిరపకాయల కారమును నీటితో నూరి ఉండ జేసి ప్రాతఃకాలమున, కొద్దిగ పుచ్చుకొన నగును.

4. నల్ల మిరియాల పొడిలో కొద్దిగ పుదీనాపువ్వు వేసి పరగడుపున తీసుకొని కొంచెము నీటిని త్రాగ వలయును.

5 జీవ సాధన వ్యాయామములో చెప్పబడిన సాధనములు చేయనగును.

6. మునగ ఆకు రసములో కొద్దిగ ఉప్పు కలిపి యిచ్చిన బిడ్డల అజీర్ణము తగ్గును.

7. ఉప్పు, ఆవాలు కలిపి మింగి నీళ్లు త్రాగిన అజీర్ణ వాతము హరించును.

8. ధనియాల రసమును పుచ్చుకొనుచుండ వలయును.

9 పంచదార నీళ్లు పుచ్చుకొనిన కొన్ని రకముల అజీర్ణములు తగ్గును.

10. నారింజ రసము, కొంచెము నీళ్లు, కొంచెము ఉప్పు తేన కలిపి పుచ్చుకొన వలెను.

11. నేలవేము కషాయమును ప్రతి రోజు ముప్పొద్దు ఇచ్చిన యెడల జ్వరము తగిలిన తరువాత ఆకలి పుట్టకుండుట నివర్తించును.

12. అతివసను నలగగొట్టి వేడి నీళ్ళలో వేసి నాన నిచ్చి ముప్పొద్దుల కొద్ది కొద్దిగా ఇచ్చేది.

# అడ్డగర్రలు

1. ఇవి కనబడిన వెంటనే జముడు పాలను గుడ్డకు పట్టించి పట్టు వేసినయెడల అడ్డగర్రలు పగిలి పోవుటయో అరగాకి పోవుటయో జరుగును.

2. మర్రి పాలను గుడ్డపైన మందముగ అంటించి పట్టు వేయవలయును.

3. కాకి దొండ ఆకు రసమును గాని, నల్ల ఉమ్మెత్త ఆకు రసమును గాని, వావిటాకు రసమును గాని, దొండాకు దుష్టపాకు కలిపి తీసిన రసమును గాని, యెడమ ప్రక్క గజ్జలలో బిళ్ల కట్టిన కుడి చెవిలోను, కుడి ప్రక్కను అయి నప్పుడు ఎడమ చెవిలోను, యిరు ప్రక్కలను అయిన యెడల రెండు చెవులలోను పోయుచుండ వలెను. ఏరోజు కారోజు చెవులు నూనె గుడ్డతో పరిశుభ్రము చేయవలయును.

4. ప్రథమమువనే గచ్చకాయలోని గంధము తీసి పట్టు వేసిన వారించును.

5. తామర ఆకునుగాని, ముండ్ల తోటకూరను గాని, గొబ్బి ఆకును గాని ఆనప ఆకును గాని ఆముదముతో వెచ్చ చేసి, కట్టవలయును.

6. ఒక భాగము గంధకము, మూడు భాగములు సూరేకారములను కాల్చి మసి చేసి అందులో కొంచెము రాసున్నము కలిపి పట్టు వేయవలెను.

7. గుంటకలగరాకు మొక్కలను లేక చిగుళ్ళను తెచ్చి అందులో కొంచెము మిరియపు పొడిని కలిపి ఏ గజ్జలో బిళ్ళ ఉన్నదో దానికి ఎదురు ప్రక్క చెవిలో అయిదారు చుక్కలు ప్రతి రోజు ఉదయమున పిండుచుండిన యెడల గడ్డలు గూడు కట్టుట పోవును.

8. నల్ల ఉమ్మెత్త ఆకు పసరును నువ్వులనూనె సమానముగ కలిపి రస మిగురు వరకు కాచి ఆ కాచిన నూనెను ఏ వైపున బిళ్ళ యున్న యెడల ఆ రెండు వైపుల పోయుచున్న యెడల బిళ్ళలు హరించును.

## అతి మూత్రము

1. వరుండ బోవునపుడు కొంచెము మోతాదుతో మొదలిడి పెసర గింజంత క్రమ క్రమముగ నల్లమందు వేసుకొని రాసున్నపు నీరు పాలు కలిపి త్రాగవలయును.

2. సలసల కాగే వేడి నీటిలో పసుపు వేసి ఆవిరి ముఖమునకు పట్టు చుండవలెను.

3. జాజికాయ వక భాగము, కురసాని వాము రెండు భాగములు, జాపత్రి వక, భాగము పెద్ద ములగ లవు వక

భాగము, గంజాయి ఆకు నాలుగో భాగమును అన్నిటిని నూరి అర భాగము నల్లమందును కలిపి నూరి కొబ్బరికాయ నీళ్లతో మూడు దినములు వర్ధించి శనగ గింజలంత మాత్రలు చేసి నలభయి రోజులు ఉదయముననే వక్కొక్క మాత్ర వేసి కొని తీపి పదార్థములు తినిన నివర్తించును. వాడునపుడు శరీర పటవమునకు వ్యతిరేకముగ పని చేయకుండునట్టుల జాగ్రత్త చేసుకొనవలెను.

4. కసివింద విత్తుల చూర్ణమును తేనెతో యిచ్చిన కట్టును.

5. తంగేటి పచ్చి పువ్వులను తెలక పిండిలో వేసి కూర వండి వక మండలము అనుపానమును పుచ్చుకొను చుండిన కట్టును.

6. ముడి నువ్వులు, పోతు తాడిబెల్లము సమ భాగములు కలిపి దంచి పూటకు తులము చొప్పున రెండు పూటల వాడవలయును.

7. పోతుతాటి చెట్టు తీపి కల్లును గాని, బూడిద గుమ్మడి రసమును గాని కొంచెము పసుపు కలిపి త్రాగు చుండవలెను.

8. పచ్చి వెల్లుల్లి పాయల రేకలను మొదటి 1 రోజు 1 రేకతో మొదలు పెట్టి ఎనిమిది రేకల వరకు క్రమ క్రమముగ రోజువారీగా హెచ్చించుచు తరువాత వెనుకకు తగ్గించుచూ రేకలను తినవలెను.

9. ఆవు చల్లలో నిమ్మరసమును వేసి ప్రతిరోజు ప్రాతఃకాలమున రోగనివారణ వరకు పుచ్చుకొన నగును.

10. పొడిచువ్వలను పూటకు తులము చొప్పున నీటితో పుచ్చుకొనవలెను. లేక నమలి తినినను తినవచ్చును. తినుటయే మంచిది.

11. ఈతవేళ్ళ రసము నాల్గుతులములు రెండు తులములు పంచదార కలిపి ఉదయపు పూటల యివ్వనగును.

12. ఆవుపాలలో పటికి చూర్ణము కలిపి ఉదయము వనే పుచ్చుకొను చుండవలయును.

13 నీలిగడ్డ గోచీ పెట్టించవలెను. బహుమూత్రము తగ్గును.

14. వాయింట గింజలను. చూర్ణముచేసి కొంచెము ఉప్పు కారము వేసి ప్రతిపూట అన్నములో ప్రథమ కబళములో తినేది.

15. నిద్రపోబోవునపుడు చిన్న మోతాదులో నల్లమందువేసి పిమ్మట కొంచెము రాసున్నమునీరు పాలుకలిపి యివ్వవలెను.

16. వాము, శు॥ జీడిగింజలు, కరక్కాయ, 2 భా॥ పదిభాగములు వేపాకు రసమునవండి చూర్ణించి సేవించిన బహుమూత్రము హరించును. ఇది చాలా మంచిది.

17. ఉసిరికపప్పు కషాయమును చల్లతో కలిపి ప్రతిరోజు సేవించవలెను.

## అతిగా మూత్రము బంధిస్తే

1. బొడ్డలో సూరేకారము ముక్కను వుంచి పైన నీళ్లు పోస్తూ ఉండవలెను.

2. కేవలిచిన్ని, నూకేకారమును పటిక నీళ్ళలో నూరి త్రాగించవలెను.

## అల్పచమానం - రాళ్ళు
## ఇసుక పడేవాటికి

1. ముల్లంగి గడ్డల రసములో పంచదార కలిపి పుచ్చుకునేది.

## అతిసారము (విరేచనములు)

1. గచ్చపలుకులు, కరక్కాయ బెరడు, నల్లమందు, జాజికాయ ఇవి సమభాగములు నూనవేసి వేయించి తేనతో మర్దించి శనగ గింజలంత మాత్రలుచేసి పుచ్చుకొనిన విషూచి ప్రబలమైన అతిసారము తగ్గును.

2. కవిరి, దాచినచక్కను తేనె నూరి గోలీలుగ చేసి యిచ్చుచుండవలెను.

3. నల్లమందు, ఖర్జూరపుకాయ, జాజికాయ ఒక్కొక్కటి పావుతులము చొప్పున తమలపాకు రసముతో నూరి 30 మాత్రలు చేసి పూటకు రెండుమాత్రల చొప్పున రోజుకు మూడుసార్లు చొప్పున నీటితో మ్రింగవలయును.

4. సగముపండిన నేరేడుపండు గుంజును మంచినీళ్ళలో వేసి పిసికి రోజూ ముప్పొద్దు ఇవ్వవలెను. జ్వరమున్న వేళలలో పుచ్చుకొనవలెను.

5. రోగబలిమినిబట్టి ఆహారనియమము చేయవలయును.

# అరికాళ్ల మంటలు

1. నల్లేడు కాడను గొంచెము వెచ్చచేసి పసుతీసి మర్దన చేసినయెడల తగ్గిపోవును.

2. వరగడుపున తేనె తులము, నిమ్మరసము తులము, నాలుగు తులముల నీటినికలిపి త్రాగుచుండిన తగ్గును.

3. సుగంధి, జీలకర్ర, నల్లజీలకర్ర, యాలకులు సమముగా చూర్ణించి ఆవునేతిలో కలిపి రాచేది.

4 మామిడిపలకాయ, గోరింటాకు. నారింజవేరు, చెక్క నూరిరాచేది.

# అరిచేతులలో మచ్చలు

1. కృష్ణ తులసి ఆకురసమున కరక్కాయల గంధంతీసి రాయుచుండిన యెడల తెల్లమచ్చలు పోవును.

2. కరక్కాయ బెరడును, చిత్రమూలముచు నిమ్మ రసాన నానవేసి తీసి కొత్తరసముననూరి, జాగ్రత చేసుకొని వుంచుకొని ప్రతిరోజునను రాయుచుండిన యెడల దురదలుగల మచ్చలు, అంటుడు కురుపులు మచ్చలు మాయమగును.

3. ఉత్తరేణి సమూలం భస్మంచేసి అందులో నాల్గవ వంతు సున్నము కలిపి చిట్లాముదముతో నూరిరాచేది.

# అరుచి

1. ఉప్పున కాల్చిన అల్లపుముక్కను అద్ది తినవలెను. అజీర్ణముతో గూడిన అరోచకము తగ్గిపోవును.

2. అల్లపు రసములో తేనెను కలిపి పుచ్చుకొనిన కఫముతో కూడిన అరుచి తగ్గును.

3. ఆవాలను నూరి నాభిపైన ప్రతిరాత్రియు పట్టు వేయవలెను.

4. కరక్కాయను కాల్చిన పెరటిని వకుండబోవునపుడు నోట నుంచుకొని రసము మ్రింగుచుండిన మంచిది.

5. భోజనమున ప్రథమ కబళమున కాల్చిన శొంఠి పొడుమును ఉప్పు వేసి తినవలయును.

6. శొంఠి, పిప్పళ్లు, మిరియాలు వీటి సమభాగములు చూర్ణించి కొంచెము శర్కర కలిపి ఉదయ సాయంత్రములు తినుచుండవలెను.

7. అల్లము ముక్కను కాల్చి ఉప్పు కలిపి పుచ్చుకొనవలెను.

8 బొడ్డుపై ఆవాలునూరి పట్టు వేయవలెను.

9. నిమ్మకాయ రసములో, జీలకఱ్ఱ, సైంధవలవణము, అల్లపుముక్కలు, నానబెట్టి ఉదయము, సాయంత్రము పుచ్చుకొనవలెను.

# అండవృద్ధి

1. గుగ్గిలపు పొడిని గోమూత్రములో కలిపి ప్రాతఃకాలమున పుచ్చుకొనవలెను.

2. గోమూత్రములో ఆముదమును కలిపి పుచ్చుకొనిన చిరకాలము నుండియున్న అండవృద్ధి తగ్గిపోవును.

# అంగములో రాళ్లు

1. తెల్ల జిల్లేడు పువ్వులను ఆవుపాలలో కలిపి కాచి 3 రోజులు తప్పక పుచ్చుకొనవలెను.

2. పత్తికాయలను కమ్మలో వుడికించి గింజలుతీసి కొంచెము నీటితో కలిపి పుచ్చుకొనవచ్చును.

3. మూడు శేర్ల నీళ్ళలో అర్ధ శేరు పెసరపప్పువేసి కాచి ఆకట్టు నీళ్లను యిచ్చుచుండుము.

# అంగ బలహీనము

1. తెల్ల గన్నేరుపాలు, అక్కలకర్ర చూర్ణము కలిపి రాత్రులు అంగమునకు రాయుచుండవలయును.

2. ఆవనూనెను పరుండ బోవునపుడు రాచుచుండవలెను.

వెన్నను గోరోజనమును కలిపి యుంచుకొని పరుండబోవునపుడు ప్రతిరోజును మర్దన చేయవలయును.

# ఆని కాయలు

1. జీడిమామిడి గింజలోని చమురును ఆనికాయలకు రాయవలెను.

2. జిల్లేడుపాలను ఆముదములో కలిపి కాచి రాయుచుండవలెను.

3. మనుష్యుని చెవిలోనిగులిమిని పైనవూ[illegible]లెను.

## ఆసన గండమాల

1. గంధకం, రసము, సైంధవలవణం సమభాగములు, జిల్లేడుపాలు ఉత్తరేణి వేళ్ళ రసంతోను నూరి పైనిరాచేది. పైని శుద్ధి చేయునక్కరలేదు.

## అర్శకపోటు

1. కొద్దియిరియుప్పు పొడిని వేసిగాని, తేనెను అరతులం వేసిగాని, ప్రాతఃకాలమునను, సాయంత్రమునను, గుమ్మపాలు పుచ్చుకొన నగును.

2. మెంతి బూరెలుచేసి ఉదయముననే పరగడుపున రెండు తినిపించు చుండవలెను.

3. రాత్రిపూట వేడి అన్నములో వేడిపాలను పోసి తెల్ల నీరుల్లిపాయ ముక్కలువేసి తోడుపోసి ఉదయముననే తిను చుండవలెను.

4. జీవసాధన చేయవలెను.

5. రాత్రిపూట వెండి గిన్నెలో చక్రకేళివండు, తేనె వేసి ఆరుబైటవుంచి ప్రాతఃకాలముననే పుచ్చుకొనవలెను.

6. వెన్నను ఉదయముననే పరగడుపున తినిపించవలెను. శ్లేష్మతత్వము గలవారికి పనికిరాదు. చాలా వేడి తత్వముగల వారికి చాలా మేలుచేయును.

7. ప్రాతఃకాల స్నానము చేయించవలెను. వ్యాయామము [illegible]వి.

# ఇంద్రియనష్టము (వీర్యవృద్ధి)

1. అరటిపండులో బొరియచేసి అందు మిర్రిపాలు పోసి ఉదయముననే పుచ్చుకొనవలెను. చక్రకేళి పండైన మంచిది.

2. నాలుగు గురిగింజలెత్తు కారతికర్పూరము, వక గురిగింజ ఎత్తు నల్లమందును కలిపి ఆమోతాదున మాత్రలు చేసి వుంచుకొని రాత్రి పరుండబోవునపుడు వక్కొక్క మాత్రను వేసుకొనుచుండిన తగ్గిపోవును.

3. ఒకతులము అతిమధుర చూర్ణమును తేనె, నెయ్యి తోకలిపి పుచ్చుకొనవలెను. తరువాత ఆవుపాలను పుచ్చుకొనవలెను. తులమును మూడు రాత్రులంచొప్పున వాడుటమంచిది.

4. శనగలను నీళ్లలో రాత్రుల్లు నానబెట్టి ఆ శనగలను నానబెట్టిన నీళ్లలో తేనెను కలుపుకొని త్రాగి శనగలను తినవలెను. పోయిన పుంస్త్వము తిరిగివచ్చును.

5. ఒకతులము పసుపు, ఉసిరికపప్పు వకతులము యిరవయి తులముల మంచినీళ్లలో వేసి కషాయముగబెట్టి అయిదు తులములు అగువరకు మరగనిచ్చి అందు అరతులము తేనె వేసి కలిపి యివ్వవలెను. ఇందువలన వాత దోషము వలన కలిగిన ఇంద్రియస్ఖలనము నివర్తించును.

6. నేతిలో వేయించిన మినపపప్పును ఆవుపాలలో వైచి శర్కర గలిపి పాయసంజేసి భక్షించుచుండవలెను. 40 రోజులకు తక్కువగాకుండ పుచ్చుకొనవలెను.

7. గుంటకలగరాకు రసమును ప్రాతఃకాలమున నిత్యము వకమాసము పానముచేయుచు వెంటనే ఆవు చ్చు

కొనుచుండిన బలము, వీర్యము గలిగి నూరు సంవత్సరములు జీవించెదరు. 1 తు. రసము 1/4 పావుశేరు పాలు.

8. గొబ్బిగింజల చూర్ణమును శర్కరనుగలిపి ఆవు పాలతో పుచ్చుకొననగును.

9. ఆవుపాలలో యిండుపగింజల ముక్కలను నానబెట్టి ప్రతిరోజును ప్రాతఃకాలము చొప్పున తిని పాలు త్రాగుచుండిన నష్టము పోయి పుష్టిగలుగును.

10. ప్రత్తిగింజల పప్పును ఆవుపాలలో వేసి నూరి శర్కరను కలిపి తినుచుండుట మంచిది.

11. ఎండిపోయిన మామిడి పిందెల చూర్ణములో నాలుగురెట్లు పంచదారను కలిపి రోజును ప్రాతఃకాలమును పుచ్చుకొని ఆవుపాలను పుచ్చుకొనవలెను.

12. గొబ్బివిత్తులు, చింతగింజలు సమభాగాలు మరి పాలలోతడిపి నీడను ఎండించినూరి సమభాగాలు పంచదారతో కలిపి ఉదయము సాయంత్రములు ఆవుపాలతో పుచ్చుకొనవలెను.

13. హారతి కర్పూరములో నాలుగవవంతు నల్లమందు కలిపి నాలుగైదు గురిగింజలయెత్తు రాత్రి పరుండబోవునప్పుడు పుచ్చుకొనిన ఇంద్రియస్ఖలనము కట్టును. ప్రతిరోజున పుచ్చుకొనవలెను.

## బీజబంధు

1. జాజికాయ, లవంగాలు, కుంకుమపుప్వు, నల్లమందు, ఇవి [illegible] భాగములు తేనెతో మర్దించి శనగలపరి

మాత్రలు చేసి భోజనమయిన తరువాత ఒకమాత్ర సేవించేది. దీ:కి విరుగుడు నిమ్మపండ్ల రసము. దీనిని సేవించిన రాత్రి తీపి వస్తువులు తిని పాలు త్రాగు చుండవలెను.

# ఉదర రోగములు

1. పాలలో అల్లపురసము వేసి కొద్ది పంచదారను వేసి గాని వేయకగాని కాచి త్రాగుచుండిన యడల సమస్త ఉదర రోగములు హరించును.

2. మజ్జిగలో కలకండ, మిరియాల చూర్ణము కలిపి పుచ్చుకొను చుండిన పిత్తోదరము శాంతించును.

3. వాము, జీలకర్ర, శొంఠి, పిప్పలి, మిరియాలు చూర్ణించి సైంధవ లవణమును కలిపి మజ్జిగలో కలిపి పుచ్చుకొనిన కఫోదరము శమించును.

4. పిప్పలి చూర్ణమును బొంతజెముడు పాలతో తడిపి ఎండించి వుంచుకొని ప్రతిరోజును అయిదు చిన్నముల ఎత్తు చూర్ణమును బియ్యపు కడుగుతో ఏడు దినములకు తక్కువ గాకుండ పుచ్చుకొనిన చిరకాలముగనుండు జలోదరము హరించును.

5. మిరియాలు, పిప్పలి, శొంఠి, జీలకర్ర, సైంధవలవణం లవంగం యివి ఒకటొకటి ఒకఫలము తీతగా వేచి పొడిచేసి, ఒకవరహా ఎత్తు వంతున ప్రతిదినము రెండు పడవలు నేతిలో నైనను చీనీలోనైనను నిచ్చుచు వచ్చిన అగ్నిమాంద్యము, కడుపునొప్పి గుల్మము, వాతము మొదలగు ఘోరరోగములు కుదురును.

6 పిప్పళ్ళు 3 తులములు, 8 తులముల మంచినీటిలో నూరి 4 తులములపాలు, 1 తులము నెయ్యి కలిపి ఉంచుకొని రోజుకు మూడుసార్లు పుచ్చుకొనేది.

## ఉమ్మెత్తగింజల వికారశాంతి

1. నాలుగు శేర్ల ఆవుపాలలో నాలుగు తులములు చీనాచక్కెర కలిపి కడుపుపట్టిన మాత్రము త్రాగించవలెను.

2. లవణమును ఉదకములో కలిపి త్రాగించవలెను.

3. పైడివత్తి పువ్వులు, కలకండ వీటిని నీటిలో నూరి పానము చేయవలెను.

## ఉబ్బసము

1. నల్లతుమ్మ చిగుళ్లు కొద్ది మిరియాలను నూరి కందిగింజలంత మాత్రలు జేసి పూటకు వక్కొకటి చొప్పున మువ్వొద్దులు తీసుకొన వలయును.

2. వెల్లుల్లి పాయల రసమును వేడినీళ్ళలో వేసి ప్రతిదినమును త్రాగుచుండవలెను.

3 వచ్చిజిల్లేడు పువ్వులు వకవంతు మిరియాలు వకవంతు అయిదు గోధుమగింజల యెత్తుగ మాత్రలుచేసి ఆరవిచ్చి వుంచుకొని రోగ బలిమినిబట్టి పుచ్చుకొను చుండవలెను.

4. అక్కలకర్ర కషాయమును 2-4 తులములు రెండు పూటల పుచ్చుకొనుచు రావలెను.

5. ఉత్తరేణి సమూల భస్మమును తేనెతో కలిపి యిచ్చుచుండిన దగ్గులు, ఉబ్బసము హరించును. ఒక వడ్లగింజ మొదలు రెండుగింజల ఎత్తువరకు మోతాదు.

6. గచ్చపప్పు చూర్ణము వకవంతు, మిరియాలచూర్ణము వకవంతు కలిపి గాజుబిరడాగల సీసాలోవేసి వుంచుకొని 10 గ్రెయినుల చొప్పున రెండుపూటల పుచ్చుకొననగును.

7. బలురక్కసి, నల్లేరు, ఉప్పు కలిపి సేవించిన యడల ఉబ్బసము తగ్గిపోవును.

8. అరటి పండులో మిరియపు చూర్ణము కలిపి తీసికొనిన చాలాకాలమునుంచి యుండిన కాసరోగములు హరించును.

9. చిత్రమూలపు వేళ్ళను, పిప్పళ్లను చూర్ణముచేసి తేనెలో పుచ్చుకొనిన ఎక్కిళ్ళు శ్వాసకాసలులు మానును.

10. హారతి కర్పూరమును, ఇంగువయును సమభాగములు కలిపి ఎనిమిది గోధుమగింజల పరిమాణమున మాత్రలు చేసి రెండుగంటల కొకమాత్రను మిరియాల కషాయముతో యిచ్చిన దగ్గు, వగర్పు ఉద్రేకములు తగ్గును. తిండి తగ్గించవలెను.

11. ఉస్తి పరుగును వేయించి తినినను, పరుగు చూర్ణమును తేనెతో పిల్లలకు తినిపించనను, పాల ఉబ్బసము తగ్గును.

12. బూడిదను, కొండనాలుకకు నొక్కినను, నల్లజీడి కొండనాలుకకు తగిలించినను, కొబ్బరినూనెను వెచ్చగా అంటించినను, కొండనాలుక వాలి వచ్చిన దగ్గు తగ్గును.

## ఉబ్బు

1. ఏభయి తులముల పాలలో మూడుతులముల ఆవాల గుండను వేసి కాచి ప్రతిరోజును అనేకసార్లు యిచ్చు చుండ వలయును.

2. పెద్దదూలగుండ వేరు గంధమును వంటికిబూసి వేరు ముక్క వకటి ముంజేతికిని, వకటి శీలమండకును గట్టిన నివ ర్తించును.

3. కరిదూవము, వెల్లుల్లిని, మార్కండాకు పసుపుతో నూరి పూటకు అరతులము చొప్పున యిచ్చేది.

4. కసివింద వేరును నూరి లోపలికి కాయవలయును.

5. గోధుమ రొట్టెలు అప్పడమువలెచేసి తిని వేన్నీళ్లు పుచ్చుకొన వలెను. కారము,, పులుపు మానవలెను.

6. నారింజపండ్ల రసములో ఆవుపాలను త్రాగుచుండిన తగ్గిపోవును. ఆ రోజులలో అన్నము తినకుండ అట్లుచేసిన అద్భుతముగా కుదురును.

## ఊపిరికొట్టు నొప్పి

1. వెల్లుల్లిపాయల రసమువ ఏకపుల్లిపాయచు మెత్తగా నూరి తేనితో లోపలి కియ్యవలయును.

2. గలిసి బాగా పీల్చుకలిగినంత వరకు పీల్చి నిలువ వుంచ గలిగినంతవరకు వుంచి నెమ్మదిగ వదలుచుండ వలెను. పైన శొంఠినిగాని ఆవాలనుగాని మజ్జిగతో నూరి పట్టు వేయ వలెను.

4. నాలుగు తులముల చన్నీటిలో ఒకతులము తేనె వేసి కలిపి యివ్వవలయును.

5. వరుఁడబెట్టి కాఫీ యియ్యవలయును.

## ఎలుక (పారిపోవుటకు)

1. జీడిగింజలనుగాని, జిల్లేడుకాయలనుగాని ముక్కలు చేసి ఎండపెట్టి పొడిచేసి ధూవము వేయవలెను.

## ఎలుక కాటు

1. పత్తిఆకును పులికడుగు పోసి నూరి యివ్వవలయును.

2. గానుగవేరు గంధముతో మిరియాలను నూరి మూడురోజులు యివ్వవలెను.

3. మగిషివెంట్రుకలను నూనెలో తడిపి కాల్చి మసి చేసి గాయములో పూరవలెను.

4. చింతగింజలు, కరిధూవము యీరెంటిని నూరి పాతనేతిలో రోగబలానుసారముగ సేవించిన ఎలుకవిషము నివర్తించును.

5. ఎలుక కరచినచోట వెన్నపట్టించి పిల్లిచే నాకించిన విషము తప్పక విరుగును.

## ఏలిక పాములు

1. బెల్లము జల్లజీడి మెత్తగా నూరి అర గోధుమగింజ ఎత్తు చొ॥ గాని వరుండబోవునవుడు ఒక గింజఎత్తుగాని యివ్వవలయును.

2. ఆముదపు దీవమున నల్లమందునుపొంగించి ఆముదముతో నూరి పుచ్చుకొనవలెను.

## ఏనుగకాలు ( బోదకాలు )

1. రసభస్మము అరగోధుమగింజ ఎత్తు, 3 గోధుమగింజల ఎత్తు సురమారాయి భస్మము, ఆరు మొదలు వది గోధుమ గింజలఎత్తు వరకు జిల్లేడువేరు చూర్ణమును కలిపి మాత్రలు జేసి పంచుకొని ఎనిమిది గంటల కొక మాత్రచొప్పున నాలుగైదు దినములు యివ్వవలయును.

2. రత్నపురుష సమూలాల చూర్ణము యింటకుసమము వంచదార కలిపి రెండుపూటల నాలుగు అణాలఎత్తు మోతాదుతో యిచ్చుచుండవలెను.

3. ఆముదము, గోమూత్రము పెద్ద కరక్కాయ చూర్ణము కలిపి పుచ్చుకుంటే బోదతగ్గునని భావప్రకాశి యందు చెప్పబడెను.

4. కరక్కాయ చెక్కలమాడ్చి ప్రతిరాత్రి తేనతో పుచ్చుకొనుచు ఆవువెన్నను తేనె సమభాగములు కలిపి రాత్రులుబాగా ఆస్థలమున మర్దనచేయు చుండవలయును.

5. కరక్కాయ, తెల్లనిపాలు, శొంఠి, వస, మునగవేరు, సమభాగములు చేర్చి జిల్లేడు పాలతోనూరి, శీవము జేసిన శ్లీపదరోగము నశించును.

## కడుపు నొప్పి

1. మిరియాలు, వాము, ఉప్పును సమభాగములు నొప్పియున్నప్పుడును, అజీర్ణముగాయుండినప్పుడును తినిన తక్షణమే తగ్గును. కొంచెము నీటివి త్రాగవలెను.

2. వామును ఉప్పును కలిపి నమలి నీరు త్రాగవలెను.

3. కొంచెము ఉప్పును నీటిలో కలిపి యిచ్చిన వమనమై నొప్పి తగ్గును.

4. శొంఠిపొడితో ఎక్కువగా భోజనమును, కాఫీగాని మిరియాలు పాలు పంచదారగాని తీసుకొనవలెను.

5. ఛాతీపై ఉప్పుతో కాయవలెను.

6. సున్నము బెల్లముగాని, కోడిగుడ్డు సొనను అందు కలిపి గాని ఛాతీపై పట్టు వేయవలయును.

7. తేలిక విరేచన సాధన చేయవలయును.

## ఎక్కిళ్ళు

1. నల్లేరు కాడలను కుమ్ములోబెట్టి ఉడికించి రసము తీసి అందులో తేనెకలిపి యిచ్చిన దారుణఎక్కిళ్ళు నిలుచును. అరతులము రసము అరతులము తేనె మోతాదు.

2. అల్లపు రసమును తేనెతో కలిపి యిచ్చుచుండిన తగ్గును.

3 చల్లని నీటిని కొద్దికొద్దిగ పోయుటవలన వేడిచే పుట్టిన ఎక్కిళ్ళు తగ్గును.

4. గుమ్మడి గింజలను ఆముదపు దీపమున కాల్చి మసి చేసి తమల పాకులతో మడచి తినవలెను.

5. ఉసిరికవప్పు, పిప్పళ్లు శొంఠి చూర్ణమును చక్కెరతో కలిపి తేనెతో యిచ్చుచుండవలెను.

6 కటకరోహిణి చూర్ణమును తేనెతో కలిపి పిల్లలచే నాకించిన ఎక్కిళ్ళు కక్కులుకూడ మానును.

7. యష్టిమధుకము, చక్కెర తేనెతో చూర్ణముచేసి ముక్కున పీల్పించేది.

8. మేకపాలలో శొంఠి చూర్ణము వేసి కాచి యివ్వవలెను.

9. నెమలి యీకను కాల్చి దాని పొగను వాసన జూచినచో ఎక్కిళ్లు తగ్గును. దాని మసిని తేనెతో నాలికకు రాసిన మంచిది.

## ఎగరొప్పు

1. మిరియాలకషాయమును లోపలికివ్వవలెను. మిరియములు బొడ్డుచుట్టు పట్టువేయవలయును.

2. ఆవపట్టు వేయవలయును.

3. ఆముదము కొంచెము రసకర్పూరము యివ్వనగును.

4. కృష్ణతులసి ఆకురసము తేనెకలిపి యిచ్చుచూ రావలయును.

## ఎండదెబ్బ

1. నువ్వులనూనెలో చనుబాలుపోసి రంగరించి చెవులో వేసి, వేడివేడి చిట్టుడుకు నీళ్లమీద కొద్ది నెయ్యివేసి కలిపి యివ్వవలయును.

2. నీరుల్లిపాయల రసమును వంటికి పూయవలయును.

3. పడగండ్లు పడినపుడు ఏరి విభూతిలో వేసి ఆవిభూతిని జాగ్రతచేసి వుంచుకొని ఎండదెబ్బ తగిలినవారికి మూడువేళ్లకు వచ్చినంత విభూతిని మంచినీటిలో వేసి యిచ్చుటవలన తగ్గును.

3. శొంఠికషాయమును పాలలోకలిపి కొంచెము పంచదారమువేసి పుచ్చుకొనవలెను.

4. అల్లపురసమును పుచ్చుకొనిన తగ్గును.

5. అల్లపురసముతో తేనెను కలిపి పుచ్చుకొనిన కడుపునొప్పి పైత్యము తగ్గుటయేగాక పడిశెము, విరేచనబద్ధము, శ్వాసకాసలు, కఫము నశించును.

6. సీమమిర్చిని నూరి ఎక్కువగా నొప్పి ననుసరించి మింగిన కడుపునొప్పితగ్గును.

# కడుపులో బల్ల

1. పుల్ల బచ్చలి దుంప చూర్ణమును వేన్నీళ్లలోవేసి ప్రతిదినమును పుచ్చుకొనుచుండవలెను.

2. ఒక్క కొత్తకుండ తెచ్చి అందులో ఉప్పు, జిల్లేడు ఆకులు సమభాగములు వేసి పైన మూకుడువేసి మూసి లోపల ఉప్పు చిటపట అనటమానే పర్యంతము క్రింద మంట పెట్టి చల్లారిన తరువాత తీసి నూరి అగతులపు మాత్రలుచేసి పూటకు పక్కొక్కమాత్ర చొప్పున పంద్రెండు రోజులు వేడినీళ్లతో పుచ్చుకొనవలెను. ఇచ్ఛాపత్యము.

3. రుద్రాక్షను చనుబాలతో అరుగదీసి అప్పుడప్పుడు యిచ్చుచుండవలయును.

4. ములగచెక్క రసము, వెల్లుల్లి రసము నాలుగేసి తులములు, పకతులము ఆవాలు కలిపి మేకపాలలోపోసి త్రాగించవలెను. విరేచనమై తద్వారా బల్లకరగిపోవును.

5. నేపాలపు గింజలలోని పప్పును గుడ్డలో మూటగట్టి

పేడలో నుడికించి తీసి వాటిలోని ఆకులను తీసివేసి వకవంతు పప్పును రెండువంతులు కవిరిని వేసి నూరిన విరేచనౌషధముగ వాడనగును. మోతాదు నాలుగు గోధుమ గింజలఎత్తు. కడుపులో బల్లలుగలవారికి దినమునకు వక గోధుమగింజ ఎత్తు చొప్పున కొన్ని దినములు యిచ్చిన నయమగును.

## కన్ను

1. చిల్లగింజను తేనెతో గంధము తీసి పచ్చ కర్పూరమును చేర్చి కన్నులయందిడిన కన్నులు నిర్మలముగనుండును.

2. ఉసిరిక, కరక్కాయ, తాడికాయ యీపప్పులను చూర్ణము చేసి నిమ్మవండ్ల రసముతో మర్దించి కణికలను చేసియుంచుకొనవలెను. కంటికి నీటితో కాటుకబెట్టిన యెడల కన్నులనుండి నీరుకారుట, తిమిరము మొదలగుకంటి రోగము హరించును. (మాధవనిదానము).

3. పచ్చకర్పూరమును మర్రిపాలలో నూరి రెండు మాసములు కన్నులయందిడిన కంటి యందలి పూవులు హరించును.

4. గాడిద దవడయందుండు దంతమును గంధము తీసి పెట్టిన స్ఫోటకవ్యాధిలో జనించు కంటిజబ్బులు హరించును.

5. మసగలకు పటికను పన్నీరులో అరగతీసి వేయుచుండవలెను.

6. చనుబాలలో పంచదారను కలిపి వేయుచుండిన పువ్వులు తగ్గును.

7. సీమబాదం పప్పును చనుబాలలో అరగతీసి పట్టు వేసిన కనురెప్పల రోమములు ఊడుట మానును.

8. పావురము యీకను లాగగా వచ్చిన రక్తమును రాత్రిలు కంటిలో పెట్టిన ఎర్రగావుండు పటలస్థితి పోవును.

# కర్ణ రోగములు

1. ఉత్తరేణి సమూల భస్మమును నూనెలో కలిపి చెవిలో పోయవలయును.

2. చచ్చిన తేలును నూనెలో వేసి కాచి ఆనూనెను చెవిలో పోయుచుండవలెను.

3. రసకర్పూరమును ఆవు పేడ రసముతో గంధము తీసి పోటులు కుట్టే స్థలమున లేపన మొనర్చిన సర్వ విధ కర్ణ రోగములు పోవును.

4. నీటి పిప్పలి ఆకును కొంచెము ఉప్పు వేసి నూరి ఆ రసమును చెవిలో పోయుచుండిన సమస్త కర్ణరోగములుపోవును

5. ఇంగువ, శొంఠి, ధనియాలు పీనిని ఆవనూనె యందు పక్వము చేసి చెవిలో పోసిన కర్ణశూల హరించును.

6. సముద్రపు నురుగును ఎండించిన చూర్ణమును చెవిలో బోసిన చెవి చీము, వ్రణము, బంక హరించునని చింతామణియందు వ్రాయబడెను.

# కలరా

1. మిరియాల కషాయముతో గోరోజనమును యివ్వ వలయును.

2. గంటకు మూడు గోధుమ గింజల యెత్తు చొప్పున ఎండించిన జిల్లేడు పువ్వుల చూర్ణమును యివ్వవలయును.

3. నల్లమందు రెండు తులములు, కారపు గుండ వక తులము, రసభస్మము అర తులము, యింగువ వక తులము, హారతి కర్పూరము, వక తులము నూరి పెసర గింజంత మాత్రల చొప్పున చేసి గంజితో యిచ్చుచుండవలెను.

4. మంచు గడ్డను తరుచు యిచ్చిన వాంతి కట్టును.

5. మిరపకాయలను మంగలమున మాడ్చి అందులో నీళ్లు పోసి కాచి వడపోసి యిచ్చిన దాహము తగ్గి వాంతి కట్టును.

6. నల్లమందు, యింగువ, మిరియాలు వక్కొక్కటి పావు తులము చొప్పున తెచ్చి యిరవయి మాత్రలు చేసి ప్రతి గంటకు వకటి గాని రెండు గాని రోగబలిమిని బట్టి యియ్యవలెను.

7. మిరియాల పొడి, కారపు పొడి, ½ తు॥ నల్లమందు, హారతి కర్పూరమును నూరి పులి చల్లతో గాని బియ్యపు గంజితో గాని యియ్యవలయును.

8. వటిక దాచినచక్క పొడి తేనెతో నూరి యివ్వవలయును.

9. ఎండిన పావురపు రెట్టలను తెచ్చి ఆ చూర్ణమును రెండు మూడు గురివింద గింజల ఎత్తు తమలపాకుతో తినిపించవలెను. మిరియాల కషాయము అప్పుడప్పుడు రెండు మూడు సార్లు యియ్యవలెను.

10. పది గోధుమ గింజల ఎత్తు హారతి కర్పూరము ప్రతి నాలుగు గంటలకొకసారి యిచ్చుచుండిన నయమగును.

## కందిరీగ కాటు

1. ఆముదమును సేవనము జేసిన విషము హరించును.

2. ఉత్తరేణి ఆకు రసమును సేవనము జేసిన విషము హరించును.

## కండ్ల కలక

1. పంచదార కుంకుమ పువ్వును నేతితో కాచి సస్యం చేయుచుండిన తగ్గిపోవును.

2. ఇండువ కాయను చనుబాలతో అరగదీసి కండ్లకు పైన పట్టు వేయవలయును.

3. నీరుల్లి రసమును గాని నందివర్ధన పువ్వుల ఆకులు కలిపి తీసిన రసమును గాని కండ్లలో పోసిన కండ్ల ఎఱ్ఱవులు తగ్గును.

4. నిమ్మరసము తో యినుప పెనముమీద నల్లమందును నూరి పట్టు వేయవలయును.

5 పుగాకును నమలి ఉమ్మి వేసిన కండ్లలో పువ్వులు, కండ్లకలకలు నెమ్మదించును.

6. కరక్కాయ బెరడు, నల్లమందు, యిండుపకాయ, జాజికాయ, జాపత్రి, లవంగాలు వీటిని నిమ్మరసముతో గంధము తీసి ఉడికించి పట్టువేసిన సమస్తమగు కండ్లకలకలు తగ్గిపోవును.

7. ఇరవైతులముల మంచినీళ్లలో నాలుగు తులముల పసుపువేసి గోరువెచ్చగ కాచిగాని కాయకగాని ఆనీటితో కండ్లను కడుగుచుండవలెను.

8. ములగాకురసము తేనెతో కలిపి ప్రతిరోజూ రాత్రి కండ్లకు పెట్టిన సమస్త నేత్ర వ్యాధులు హరించును.

# కామెర్లు

1. కరక్కాయ చూర్ణం తేనె కలిపి ఉబ్బు కామెర్లకు యిచ్చిన మంచిది.

2. గుంటగలగరాకు పావుతులము, మిరియాలు పావుతులము కలిపి నూరి దున్నపోతు దూడగల గేదెపెరుగుతో మూడురోజులు యివ్వవలెయును. చప్పిడిపత్యం, వేయించిన పుప్పు, కందికట్టు, కందిపప్పు, ఎండుకామెర్లకు చాలా మంచిది.

3. దున్నపోతు పేడలో గేదె మజ్జిగను కలిపి ఏడు సార్లు వడపోసి పంచదార కలిపి ప్రాతఃకాలమున ప్రతిరోజును ఏడురోజులకు తక్కువగాకుండ యిచ్చిన పచ్చకామెర్లు నివర్తించును.

4. గచ్చకాయలోని పప్పును మెత్తగానూరి వెన్నతో పొదిగి మూడురోజులకు తక్కువలేకుండా యిచ్చినచో ఉబ్బు కామెర్లు నివర్తించును. ఆవుచల్ల, అన్నం పత్యం.

5. మారేడ్కొండాకు పసరును మంచి నూనెను కలిపి త్రయ కామెర్లకు యివ్వవలయును. ఇచ్ఛాపత్యం.

6. చింతపండు పావుతులములో పక పావుతులము సున్నమును పొదిగి ప్రతిరోజు ఉదయమున మూడు రోజు లిచ్చిన ఉబ్బుకామెర్లు తగ్గిపోవును. చప్పిడిపత్యం.

7. వావింటాకు పావుతులము, మిరియాలు పావుతులము నూరి మూడురోజులు రెండుపూటలా పుచ్చుకొనిన పచ్చ కామెర్లు తగ్గును. చప్పిడిపత్యం.

8. శొంఠి చూర్ణమును ఆవుపాలతో పుకికించి యిచ్చిన యెడల ఉబ్బుకామెర్లు నివర్తించును.

9. ఆరు మిరియాలు, తెల్లఘులగ వేరు అరతులము నూరి మూడురోజులు తెల్లకామెర్లకీయవలెను.

10. వేపచెక్క కషాయములో తేనెకలిపి యిచ్చిన అన్నివిధములగు కామెర్లు తగ్గిపోవును.

11. దుష్టపాకు పసరు మూడుచుక్కలు మూడుపూటల వేయుస్తూ ఉండేది.

12. ప్రాతఃకాలమున కొంచెము గేదెపెరుగులో గాని కొంచెము మజ్జిగలో గాని నాలుగైదు గాని కొంచెమెక్కువ గాని గుంటకలగరాకు రసపుచుక్కలు వేసి ఒకవారము రోజులు పుచ్చుకొనవలెను. నూనె గోంగూర పైత్యపు వస్తువులు వర్జితము.

13. ముదురువేపచెక్క కషాయములోగాని తిప్పతీగె కషాయములోగాని తేనెనుకలిపి లోపలికిచ్చిన తప్పక హరించును. పైత్యకారవస్తువుల నెక్కువ తినుచుండవలెను.

14. ఎండిన తెల్లకాకర గింజలోని పప్పును నీటితో అరగదీసి రాత్రిపూట కండ్లకు కలికము వేసేది. రెండుమూడు రోజులు చాలును. పథ్యం: ఆవుపాలలో శొంఠివైచి కాచి దానితో మాత్రమే అన్నము తినవలెను,

## కాలిన పుండ్లు

1. మజ్జిగలో సుద్ద కలిపి రాయవలెను.

2. తడిమన్ను రాయవలెను.

3. పెరుగుమీద తేటలో పాతసున్నము వేసి నూరి రాసినయెడల వేడినూనె పడిన పుండ్లుమానును.

4. మూత్రమును ఆరఅరగ రాయుటవలన తగ్గిపోవును.

5. మున్నపునీళ్లలో కొబ్బరి నూనెవేసి గట్టి చిలికిన యెడల తెల్లగాతయారగును అదిమంచిది. అందు గుగ్గిలపొడు మును కూడకలిపి పాకముగా వండి రాచినయెడల తగ్గిపోవును.

6. కలబంద రసముచు వేసి కట్టవలెను.

7. బురదలో ఉప్పువేసి కలిపిపూసిన మంటఅణగి తగ్గి పోవును.

8. తుమ్మఆకులు అవిశఆకులు మాడ్చి ఆవుపాలలో కలిపిరాయవలెను.

9. కాలినవెంటనే మేక నెత్తురుగాని. కోడిగుడ్డులోని తెల్లసొనగాని రుద్దవలెను.

## కాళ్లు, చేతులు

1. అల్లమును బెల్లమును సమభాగములు కలిపి తినుచుండిన అరికాళ్లు అరచేతులపై పొరలు ఊడడము మాని పోవును.

2. తులమెత్తు ఆవునేయిలో బేడెత్తు మిరియాలను చితుకకొట్టివేసి కాచి ఆనేతితో మర్దనచేసిన కాళ్లు చేతులు మంటలు తగ్గును.

3. రేగి ఆకును చితుకకొట్టి కలిలోవేసి కాక నీళ్లలో వేసి చిలికినను అందుపైన నురుగు వచ్చును. ఆనురుగును అరికాళ్ల అరిచేతుల మంటలకు రాయుట వలన శమించును.

4. ఆవు వెన్నలోగాని నేతిలోగాని గోరోజనమును కలిపి దానితో కాలుచేతులకు మర్దనచేసిన నరములకు సత్తువ జేయును.

## కాళ్ల తీత

1. ఉప్పుతో కాచవలెను.

2. ఇటుకపొడుముతో కాచవలెను.

3. జిల్లేడాకుల రసముతో శొంఠిగంధము తీసి పట్టువేసిన యెడల వాతముచేత గలిగిన తీతలు నివర్తించును.

## కాళ్ల మడమల పగుళ్లు

1. పగిలిన మడములకు మర్రిపాలు పూయవలెను.

2. గుగ్గిలము, బెల్లము, నేయి, మైనము కలిపి రాయుచుండవలెను.

3. నిమ్మరసము, సైంధవలవణము, మేకపాలు, జిల్లేడుపాలు, గుగ్గిలములను వేరువేరుగాగాని అన్నిటిని కలిపిగాని ఆవువెన్నలో కలిపిరాయవలెను.

4. ఆముదపుపిండితో మడములను రుద్దుచుండిన తగ్గిపోవును

5. కొబ్బరి నూనెను కాచి అందు మైనంవేసి ఉడికిన తరివాత తీసి యుంచుకొని మడములకు మర్దన చేయుచుండవలెను.

6. గసగసాలు, ఆముదాల పప్పు నూరి రాయవలెను

## కీళ్ల నొప్పులు

1. నొప్పిగలతావున జెముడుపాలను పట్టువేయవలెను.

2. వేపనూనెలో జిల్లేడు వేరు చూర్ణమును కలిపి మర్దన చేయువలెను.

3. రెండుపాళ్లు సబ్బును, ఒకపాలు హారతికర్పూరమును

పదహారు పాళ్లు టర్పన్‌టైను నూనెతో కలిపి కలియనూరగా తయారైన తైలమును వర్ధన చేసినయెడల సమస్త కీళ్ల నొప్పులూ వాపులు, పోటులు, నయమగును.

# కుక్క కాటు

(వెర్రికుక్క అయినచో తగిన సలహా ఉచితము) గవర్నమెంటు ఆసుపత్రికి వెళ్లవలయును.

1. కలబందరసము, నూనె, సైంధవలవణము సమభాగములు జేర్చి కాచి చప్పిడి పత్యమున అయిదురోజులు యివ్వవలెను.

2. జిల్లేడుపాలు, బెల్లము, నువ్వులనూనె సమ భాగములు కలిపి యీయవలెను.

3. ఎర్రటి కోడిరెట్ట కాటుపై వేయవలెను.

# కురుపులు (గజ్జి చూడుడు)

1. మంచిగంధములో రసకర్పూరమును కలిపి పూసిన అణగి పోవును.

2. ఆముదములో శొంఠిని నూరి రాయవలయును.

3. పిండికట్టుగాని తెలగపిండి మజ్జిగలో వుడికించిగాని కట్టుకట్టవలెను.

4. పులిబచ్చలాకు కొద్దిగ ఉప్పువేసి నూరి కట్టు కట్టవలెను.

5. కలబంద గుజ్జు కట్టవలెను.

6. దొండాకు పసరున మైలతుత్తమును అరగదీసి రాయవలెను.

7. ఆముదము సున్నము, వెలిబూడిద, చనుబాలు గావి కలిపిరాయువలెను.

8. పెద్దకురుపులుగా నుండిన పిండివుడికించి కటుచుండ వలెను.

9. గడ్డ తేలి పగిలేవరకు ఆవిశఆకు నేతిలో వెచ్చచేసి కట్టవలెను. చితికిన తరువాత ఆముదములో వెచ్చచేసి కట్ట వలెను. దీనివల్ల మానును.

# కుసుమ

1. నాగకేసరములు ఒక తులము, మిరియాలు రెండు తులములు అల్లపురసముతో మర్దన చేసి శనగలంత మాత్రలిచ్చేది. (యునాని.)

2. ఈతచెట్టు వేళ్ళ రసము నాలుగు తులములు, పంచదార తులము, జీలకఱ్ఱ అరతులము కలిపి అయిదు రోజులు యిచ్చిన యెడల రక్తకుసుమ నివర్తించును.

3. ఎలుక పెంటికలు ఆవుపాలలో వేసి కాచి వడబోసి రక్తకుసుమలకు యివ్వవలెను.

4. నాలుగు తులములు మామిడి చెక్కరసము, అర తులము కవిరి కలిపి యిచ్చిన తెల్లకుసుమ నివర్తించును.

5. గుంటకలగరాకు సమూల చూర్ణము, వాము చూర్ణము, గుంటకలగరాకు రసముతో నూరి రక్తకుసుమల కివ్వవలెను.

6. పంచదార, జీలకఱ్ఱ చూర్ణముచేసి, వేయించిన శనగపిండి కలిపి ఉదయమున ఆవునేతితోను, రాత్రి వెన్నతోను యిచ్చిన యెడల రక్తకుసుమలు నివర్తించును.

7. తామర తూడు ముక్కలు ఆవు నేతితో పూటకు ఒక తులము వేయించి ఆవు పెరుగు అన్నం పథ్యంతో యిచ్చుచుండిన మొలల రక్తకసుము నివర్తించును.

8. పెద్ద సోపు చూర్ణము చేసి నేతితో కలిపి యిచ్చిన తెల్ల కుసుమ నివర్తించును.

9. కుగంజిపాము, గసగసాలు, మిరియాలు, యుర్రి కలువ దుంప చూర్ణము యివి మం నూనెతో నూరి ఆరు మాత్రలు చేసి మూడు రోజులు యిచ్ఛా పథ్యముతో యిచ్చిన రక్త కసుము నివర్తించును.

10 పటిక పొడి ఒకటిన్నర తులము, చలువ మిరియాల చూర్ణము ఆరు తులములు కలిపి తొమ్మిది మోతాదులు చేసి రోజుకు మూడు పూటలు వొక్కొక్క పొట్లం వొక్కొక్క రోజు సేవించవలెను.

11. మంచినీళ్ళు రెండు భాగములు, రాసున్నపునీరు వక భాగము కలిపి యోనిలోనికి పిచ్చికారీ చేయవలెను.

12. ప్రతిరోజును ఆవు నేతితో పెద్దసోపు చూర్ణము అర తులము పుచ్చుకొనవలెను.

13. ముదురు మామిడి చెక్క రసము నాలుగు తులములు, నూనె 7 బొట్లు, సున్నం 4 బొట్లు కలిపి రోగ బలిమిని బట్టి పూటగాని రెండు పూటలు గాని త్రాగించుచుండిన సమస్త కుసుమలు హరించును.

14. మందార వేరు నూరి నువ్వులనూని గలిపి యిచ్చిన రక్తస్రావము కట్టును.

15 సూరేకారము పది గోధుమ గింజలెత్తు, అయిదు గోధుమ గింజలెత్తు పటిక, నీళ్ళలో కలిపి రోజుకు మూడు

పూటలు యివ్వవలయును. వీనిని మునగచెక్క కషాయముతో యిచ్చిన యెడల బాగుగా పనిచేయును.

## క్రిములు (విరేచనము)

1. వాయువిడంగములను కలితో నూరి, ఉసిరికాయంత ముద్దను ప్రాతఃకాలమున పరగడుపున సేవించు చుండిన ఉదరక్రిములు నశించును.

2 వేపాకు, ఇంగువను నూరి తేనెలో కలిపి పుచ్చుకొనిన తగ్గిపోవును.

3. కొబ్బరి కాయనీళ్ళను, తేనెను కలిపి పుచ్చుకొనిన తగ్గిపోవును.

4 ఆనపకాయల గింజల చూర్ణమును మజ్జిగతో కలిపి పుచ్చుకొను చుండిన క్రిమి నశించును.

5. వాము, బెల్లము రోజుకు ఒకటి రెండుసార్లు తిను చుండిన క్రిములు నశించును.

6 మోదుగ గింజలను సన్నగ చూర్ణించి తేనెతో రెండు గురిగింజల ఎత్తు పుచ్చుకొనిన గర్భగత క్రిములు నశించును.

7. కురసానివామును రాత్రిపూట నీటిలో నానవేసి ఆనీటిని ఉదయమున కొంచెము బెల్లముతో పుచ్చుకొని కొంచెము సేపాగి ఆవామును మ్రింగిన కోష్ఠగత క్రిములు క్రింద పడును.

8. నడాపాము:- ఇవి కడుపులో వానపాములవలె పొడుగుగా పెరుగును. 5 తులములు దానిమ్మ చెట్టు వచ్చి వేరు చెక్కను, నూరు తులముల నీటిలో వేసి మువ్వావు

శేరు వరకు ఇగరకాచి దానిని అరగంట కొకసారి 2 తులములకషాయము చొప్పున రోజంతయు యిచ్చిన నాడా పాములు పడిపోవును. ఆరోజున అవి పడనియెడల మూడుతుల ఆముదమును మరుచటి ఉదయము పుచ్చుకొనిన చచ్చి పడి పోవును.

## కుక్క-నక్క కాటు

1. దుష్టపవేరును మిరియాలను చూర్ణించి సమభాగములు నేయి, నూనె కలిపి త్రాగించవలెను.

2. ఉత్తరేణి సమూలము ఎండించిన చూర్ణమును తేనెతో ఎక్కువకాలము లోనికివ్వవలెను.

3. వేపగాని, జమ్మిగంధమును గాయముమీద వేసి కాయవలెను. ఆ చెక్కలనూరి గాయముమీద కట్టవలెను.

## పిచ్చికుక్క కాటు

1. నెయ్యి కలబందరసమును కలిపి కొంచెముకాచి చల్లారిన వెనుక కొంచెము సైంధవ లవణమును కలిపి మూడు రోజులు ఉదయము సాయంత్రములు త్రాగించవలెను. కఠిన పత్యం-వేయించిన ఉప్పు, ఆవుచల్ల పాతబియ్యపు అన్నము, నేయి, బీరకాయ, ఆనపకాయ తినవచ్చును.

## కొంకు దెబ్బ

1. కలబందమట్ట, పసుపునూరి కట్టవలెను.

2. నూనెలో నల్లమందును కలిపి కాచి నిమ్మకాయ బద్దను అందుముంచి కమురగ కాచవలెను.

# కుష్ఠు

1. హారతి కర్పూరము మూడు గురివింద గింజలఎత్తు, నల్లమందు ఒక గురివిందగింజ యెత్తు కాలోమెల్ ఒక గురివిందగింజ యెత్తు కలిపి నిద్రకుబోయే సమయమున యిచ్చుచుండవలయును.

2. వసపొడిని బ్రహ్మదండిఆకు రసమున కలిపి పైన మర్దన చేయవలయును.

3. మూడు కరక్కాయలలో గింజలను తీసివేసి కొద్ది వెచ్చచేసి, పొడిచేసి ఉదయం, సాయంకాలముల చొప్పున నలభయి రోజులు సేవించవలెను.

4. వీశెడు పొగాకును నాలుగుశేర్ల నీళ్ళలో వేసి కషాయముగ కాచి దించి లవంగాలు, యాలకులు, తెల్ల కపిరి, దాదిపచెక్క తులము చొప్పున సమభాగములు ఆ కషాయమున దించి రాయుచుండవలెను.

5. సుగంధివేళ్ళపొడి అర్థశేరు, ఆవునేయి అర్థశేరు కలిపి పాకముగవండిన పదిహేను రోజులకు సరిపోవును. అటుల యిచ్చుచుండవలయును. పులుసు వర్జితము; కాక పదార్థములు కూడదు.

6. నల్ల ఉమ్మెత్త వేరునుగాని, ఆకును యెండించిన గాని లేక ఆకు రసమును యెండించిన చూర్ణమునుగాని చేసి వుంచుకొని గోధుమ గింజలో నాల్గవవంతు యెత్తు కా
వ్యతిరేకము చేయకుండునటుల చూచుకొనుచు మో
హెచ్చించుచు పదిరోజులు రాత్రులు నీటితో వ

పదిరోజులు మానివేయుచు కొంతకాలము పుచ్చుకొనవలెను. పైత్య వస్తువులు, నూనె మొదలగునవి వర్జితములు.

7. గానుగ ఆకులు, చిత్రమూలపు ఆకులు, మిరియాలు ఉప్పు వీటిని నూరి, పెరుగుతో నిచ్చిన సమస్త కుష్ఠులు పోవును.

8. మొదట శరీరమునకు నూనెను రాచి, తరువాత కేలాకులు, కామంచి ఆకులను మజ్జిగతో నూరి నలుగు పెట్టుచుండవలెను.

9. వేప చిగురుటాకులు మూడు, అయిదు మిరియములు చొప్పున నూరిన ముద్దను గచ్చకాయ మొదలు కరక్కాయ వరకు మోతాదుతో ఉదయపు పూటల కొన్ని మాసముల వరకు పుచ్చుకొనిన దారుణ కుష్ఠులు సైతము నివర్తించును.

10. బ్రహ్మజెముడు మ్రానులో ఒక రంధ్రముచేసి అందులో పచ్చి పసుపుకొమ్ము పుంచి, రంధ్రమును దాని మానుకర్రతోనే పూడ్చి, యేడు దినములు పుండనిచ్చి, యెనిమిదవరోజున తీసి ఆరబెట్టి దానిని నీళ్ళతో గంధముతీసి పూయుచుండిన శ్వేతకుష్ఠు, తెల్లపొడలు, మచ్చలు మానును.

11. నల్లగోరింటాకును మజ్జిగతో నూరి దేహమునకు తరుచు పూయుచుండిన రొమ్ముపై పొట్టుపిండివలె పొట్టు రాలు కుష్ఠు నివర్తించును.

12. పావుశేరు వేపనూనె, పావుశేరు తేనెను కలిపి ...లు కారతికర్పూరపు బిళ్ళలను కలిపి నూరి కలిపి ...తో పోసి వుంచుకొని ఉదయ సాయంత్రములు ...దున నలభయి రోజులు పుచ్చుకొనవలెను.

ఈమందు మొదలుపెట్టక పూర్వము విరేచనములకు మందు పుచ్చుకొనవలెను.

## కురుపులు (గజ్జి)

1. పుగాకును నూరి రాచిన సమస్త చర్మరోగములు పోవును.

2. గానుగ కాయలలోని పప్పును నీళ్ళతో అరగతీసి పూయవలెను.

## గర్భము నిలబడుట

1. ఆవుపాలతో తెల్లవావిడు సమూలమును నూరి బయటవున్న నాలుగురోజులు పుచ్చుకొనవలెను.

2. నూరేకారము రెండు చిన్నములు, ఒక తులము పంచదార, అరటి చెట్టులోని నీరు సోలెడు కలిపి బుంబ దినములలో లోపలికి తీసుకొనవలయును.

3. మాదీఫలపు గింజలను, ఆముదపు గింజలను నూరి నేతితో మిళితము జేసి పుచ్చుకొనిన గర్భవతి యగును.

4. ఒక మాదీఫలము యొక్క పండులోని గింజలన్నిటిని పూర్తిగ పాలతోనూరి బుతుస్నానము రోజున పుచ్చుకొనిన గర్భము నిలచుటయేగాక పురుష సంతానముగూడ గలుగును.

5. బహిష్ఠరోజు మొదలు నాలుగురోజులు కాకరాజు పసరును నూనెతో కలిపి పుచ్చుకొనిన సంతానము నిలువ కుండా పుండినచో [illegible] ను.

6. [illegible] కలిపి రోజుకి ఒక త[illegible] తిన వలయును.

## గర్భస్రావము (మాత్రపిండము పడుటకు)

1. కొద్దిపాటి తీపికల్లును (నీరా) సూర్యోదయాత్పూర్వము పుచ్చుకొననగును. విశ్రాంతి లేక కడుపునొప్పి యుండిన కొద్దిపాటి నల్లమందును వేయవలెను.

2. వెలిగారమును పొంగించిన చూర్ణమును దాచిన చెక్క చూర్ణమును కొంచెమును కలిపి వేడిగంజిలో వేసి గంటగంటకు యివ్వవలయును. గర్భము బలము చాలక స్రవము గ నగునపుడు యిచ్చుట మంచిది. మత్తువ దార్ధముల నీయకూడదు.

3. శొంఠి, వెల్లుల్లి నూరి నీటితో లోపలికి పుచ్చుకొనిన మృత పిండము పడిపోవును.

4. పాలలో ప త్తిఆకు రసము కలిపి యిచ్చిన గర్భములో చచ్చినపిండము బయటకు పడును.

5. మోదుగ విత్తులను నీళ్ళతో నూరి త్రాగించిన పిండము బయటపడును.

6. ప్రత్తిఆకు రసమును పాలలో కలిపి పుచ్చుకొనిన చచ్చినపిండము వెలికి జారును.

## గన్నేరు విష వికారశాంతి

1. పటికిబెల్లపు చూర్ణమును ... తో కలిపి పానము చేయవలయు...

కలికి

# గవదబిళ్లలు

1. అవిసిఆకు పసరును దట్టముగ గవదలమీద పట్టించి దూదిని పైన అంటించవలయును.

2. నీళ్ళతో జాజికాయనునూరి పట్టించవలయును. చెవి వెనుక లేచెడు వాపుబిళ్లలకుకూడ చాలమంచిది.

3. నల్లఉమ్మెత్తాకుల చిక్కనిరసము గాలిబిళ్లలను హరింప జేయును.

4. నల్లమందు, హారతి కర్పూరము సమభాగములు కొబ్బరినూనెలో కలిపి రాయవలయును.

5. మర్రిపాలతో సాంబ్రాణిని, హారతి కర్పూరమును నూరి పట్టు వేయవలయును.

6. కొంచెము ఆముదమును లోనికిచ్చి గవదలవాపుపై ప్లాసలుగడ్డ కట్టవలెను. కొబ్బరినూనెలో కొంచెము హారతి కర్పూరమును నల్లమందును కలిపి వ్రాయవలయును.

# గాయములు

1. ఆముదముస దూదితడిపి గాయముస కూరి ముగ్గు పైనవేసి కట్టు కట్టవలెను.

2. రాక్షసిబొగ్గు గుడ్డమసి కలిపి కూరవలెను.

3. పంచదారకూరి పైన కొద్దిగ పంచదా... వేసి కట్టవలెను.

4. ఉప్పు కలవకుండా మిరపకాయలకార...

5. వస, వాముపొట్టు, కరక్కాయబెర...

వేరుగ దంచి కలిపి నూనెలో ఉడికించి కట్ట...

6. వటికపొడుము గుడ్డుసొన కలిపి నూరి కట్టవలెను.

7. పొన్నగంటిఆకు పసరు గాయముమీద పిండవలెను. లేతఆకు నూరి గాయముమీద కట్టవలెను.

8. పరిశుభ్రమగు తెల్లటి గుడ్డను పసుపు కలిపి కూరుచు వేపాకు కషాయముతో కడుగవలెను.

## గుండెఅదురు

1. నిమ్మకాయ రసమును నీళ్లలో కలిపి కొంచెము ఉప్పునుగాని పంచదారనుగాని అందువేసి త్రాగుచుండవలెను.

2. వేయించిన జీలకఱ్ఱ, పచ్చిజీలకఱ్ఱ సమభాగములుగ కలిపి ప్రతి ఉదయమున అరతులము మోతాదుతో తినుచుండవలెను.

3. అల్లపుముక్కను కాల్చి ఉప్పుతో ప్రాతఃకాలముననే తినుచుండవలెను.

4. ప్రాతఃకాల ఉదకపానము చేయవలెను

5. వాయు వ్యాయామములు చేయుచుండవలెను.

6. ఆవ మొదలగు ఉత్తేజకర పదార్థములను, కోపము వాగ్వాదములను, సంభోగములను మానవలెను.

## గురక

[illegible]మాడ్చిన పొడుమును చిన్నకొత్తు చొప్పున [illegible]ల్లు కలిపి రోజుకు పిల్లలకు పట్టించిన గురక

# గండమాల

1. చేవమానెరు మొదమట్టు పూయవలెను.

2 ఉలవలు 4 తులములు, దిరిసెనాలు 4 తులములు, ఇంగువ తులము. 30 తులములు నీళ్లలో వేసి 8 వ వంతు ఇగురువరకు కాచి ప్రతిఉదయమును పుచ్చుకొనవలెను

3. గంధకము - పాదరసము - సైంధవలవణా సమభాగములు నూరి జిల్లేడుపాలతో ఉమ్మెత్త వేరురసముతోను మర్దించి గండమాలకు పూయవలెను.

# గుల్మము

1. నువ్వుల నూనెతో జిల్లేడు పువ్వులను వేయించి పాపుతైలము మోతాదులో ఇచ్చుచుండ గలగును.

2 మజ్జిగలో బలురక్కసివేరు అరతులము నూరి ప్రతి పూట ఇవ్వవలెను.

3. బిడాలవణము, వాము. మజ్జిగలో నానవేసి పుచ్చుకొనవలెను.

4. వాము, బెల్లము పక్కొక్క తులము లవణము కొద్దిగ కలిపి మజ్జిగతో మర్దించి కలిపి పుచ్చుకొనిన గుల్మములు హరించును.

5. నల్లమందు ఇంగువ సమభాగములు నూరి పెసర గింజంత మాత్రలుజేసి ఆపువెన్నతో పరటి రెండు పూటలు సేవించిన రక్తగుల్మములు హరించును.

# గ్రహణి

1. గేదిపెరుగులో వేడిఅన్నమును వేసికొని తినవలెను.

2. నీరుల్లిపాయలో ఒక గోధుమగింజఎత్తు నల్లమందు పెట్టి కుమ్ములో ఉడకబెట్టి తినవలయును.

3. ప్రత్తిఆకు రసము రెండు మూడు తులముల ఎత్తు పుచ్చుకొనవలయును.

4. మెంతులు పెరుగులో రాత్రిపూట నానవేసి ఉదయమున నే పుచ్చుకొనవలయును.

5. తంగేడిచెక్క కషాయము కాచి ఇవ్వవలెను.

6. కరక్కాయలోని పప్పు, శొంఠి పచ్చచేసి తేనవేసి పుచ్చుకొనవలయును.

7. నీరుల్లిపాయలు ముక్కలుకోసి నూనెలో వేయించి పెరుగుతో పుచ్చుకొనవలెను.

8. నల్లమందు, కస్తూరికలిపి మాత్రకట్టి రోగబలిమిని బట్టి ఇవ్వవలెను.

# గొంతుకు బొంగురు

1. మిరియాలు కొంచెము బద్దలుగా కొట్టి పటిక బెల్లముతో నోట ఉంచుకొని దాని ద్రవమును మింగు చుండవలెను.

2. బెల్లపు పాకములో మిరియాల పొడివేసి పాకము బట్టి ఉండలు చేసి ఉంచుకొని అప్పు డప్పుడు ఒక ఉండను బుగ్గను ఉంచుకొన వలెను.

3. లవంగాలు కాల్చి బుగ్గను ఉంచుకొని కొద్ది కొద్దిగా నమిలి మ్రింగు చుండవలెను.

# గోరుచుట్టు

1. నిమ్మకాయకు రంధ్రము చేసి గోరుచుట్టు వ్రేలిని అందులో నుంచి కట్టు కట్టవలెను.

2. పారాణి కట్టి నీరు పోయుచుండవలెను. మధ్య మధ్య సీతాఫలవు ఆకును ఉప్పు వేసి నూరి కట్టవలెను. కణుపు జిట్టకు కూడ మంచిది.

3. జిల్లేడు పాలను గోరుచుట్టు మీాద పొడిచి ఆర పెట్ట వలెను. ఇటుల రోజుకు రెండు మూడు సార్లు చేయవచ్చును.

4. దుంపరాష్ట్రము నూరి కట్టవలెను

5. పుల్ల బావిలాకు ఆముదముం వెచ్చచేసి నూరి కట్ట వలెను.

# చత్వారము

1. పింది కరక్కాయలు పంచదార సమ భాగములు నూరి కంటిలో పెట్టేది.

2. కసింద ఆకు రసములో కొంచెము ఉప్పు కలిపి వేయుచుండవలెను.

# చనుకుదురు

1. బలు రక్కసి పట్ట చిదగగొట్టి కట్టవలెను.

2. వావింట వేరు కలితో నూరి లోపలికివ్వ వలెను

3. ఆవు నెయ్యి వేసి ముదురు దూష్టపు వేరును నూరి రాయుచుండవలెను.

4. కలబంద మాలమును, పసుపును, నూరి రాసిన

మొదల చనుకుదురు పోవుటయే గాక సమస్త స్తన రోగములు మానును.

5. నూనెతో ములగ పువ్వును వేయించి గోపలికివ్వవలెను.

6 దుష్టపాకు నూరి ఆవు వెన్నతో వ్రాసిన చనుకుదురు తగ్గిపోను.

## చను మొనలు పగులుట

1. కవిరిని నీళ్లలో నానవేసి ఆ నీళ్లతో కడిగి అముదమును రాచేది. పట్టు రాపిడి పనికి రాదు.

## చిగుళ్ళ వెంట నెత్తురు

1. నీరుల్లిపాయను మెత్తగ నూరి రోజుకు రెండు పార్లు పండ్లకు తోము చుండిన నెత్తురు కారుట మానిపోవును.

2. ఒక పంతు నల్ల జీడిగింజలు అంతకు [illegible] రెం[illegible] ఉప్పు పిడకతో పోసి పైన [illegible]తకోసి చుట్టును పిడకలు వేసి పుటము వేసి మరునాడు వాటిని తీసి మెత్తగా నూరి యందు లోని రోజుకు ఒక సారి రెండు సార్లు తోము చుండిన చిగుళ్ళ వెంట నెత్తురు కారుట తగ్గుటయే గాక సమస్త విధములగు పండ్ల రోగములు తగ్గిపోవును.

3. తుమ్మచెక్క పొడి. తొగరు చెక్క పొడి. శొంఠి పొడి, లొంగెము పంచదార లవణ మా[illegible]బు నీరు సున్నపు పొడి కలిపి పండ్లు తోము చుండిన సమస్త పంటి రోగములు తగ్గిపోవును.

...రుప్వాల

...ల్లా పూయవలె...

...ము.

3. ఉరియాలు, ఉప్పు, గానుగ ఆకు... మాలపు ఆకులు కలిపి రాసిన మొండి చిడుము కూడ మగను.

4. నాగమల్లి ఆకు నిమ్మకాయ రసమున నూరి రాయవలెను.

5. నల్ల ఉమ్మెత్త ఆకు రసము పూయవలెను.

## చెమట

1. మంచి గంధము, తేనె కలిపి యిచ్చిన యెడల తాపము, చెమట తగ్గును.

2. కాళ్ళనుండి చేతల నుండి చెమట అధికముగా కారుచున్న యెడల వసుగు లద్దె రాచినయెడల తగ్గిపోవును.

## చీమలు

గంధకపు పొడి ఆకావున వేసిన చీమలు పోవును.

## చెవిపోటు

1. నీటి పిప్పలి ఆకులో కొద్దిగా ఉప్పు వేసి నూరి ఆ రసమును చెవిలో పోసిన సమస్త కర్ణ రోగములు పోవును.

దలు

## చెట్టు కాడల రసము చెవిలో

6. పండు జిల్లేడి ఆకులకు నేయి రాచి నిప్పు మీద వెచ్చ చేసి రసమును చెవిలో పిండవలెను.

7. కందదుంప సున్నము నూరి గుడ్డలో వేసి రసము పిండవలెను.

8. ఉత్తరేణి సమూలము భస్మము చేసి నూనెలో కలిపి చెవిలో పోసిన కర్ణ రోగములు నివర్తించును.

9. మేక పంచితము చెవిలో పోసిన కర్ణశూల అనగా చెవిపోటు నయమగు.

10. సముద్రపు నురుగు చూర్ణమును చెవిలో పోసిన చెవి చీము, వ్రణము, బంక హరించును.

11. వెల్లుల్లిపాయల రసము గాని వెల్లుల్లిపాయలు వేసి కాచిన నూనెగాని చెవిలో పోసిన పురాణ చెముడు, చెవినొప్పి మానును.

12. ఒక వంతు పసుపు, ఇరువై వంతుల పటిక రెండూ చూర్ణము చేసి కలిపి చెవిలోనికి పూదిన చాలా కాలముగా నుండిన రసి, చీము కారుట కట్టును.

13 నీరులిపాయ రసముగాని వీటి నడుమ నుండూ పాయ ఉడికించి తీసిన రసముగాని పోయవలెను.

14. దుక్రి జగడాకు పసరు వేసేది. బంతిపువ్వు రసము పోయవలెను.

15. పొగాకును నీళ్లలో కలిపి ఆనీటిని చెవిలో పోసిన చెవిలో మంట, చీము మానును.

16. ఆముదము, మంచినూనె కలబంద పలుకులు వండి చెవిలో పోసిన సమస్త కర్ణ వాతములు కుదురును.

## చెముడు

1. ఇంగువ, శొంఠి, సైంధవలవణం నూని తెల్లావాలు నూనెతో కలిపి కాచి చెవిలో పోయవలెను. పోటుకూడా పోవును.

2. సైంధవ లవణమును మేకమూత్రమున కలిపి కాచి పోయవలయును.

3. జిల్లేడు ఆకులు పండువి తెచ్చి నేయిరాచి నిప్పుల మీద చేతులతో బాగా వెచ్చచేసి కాచి రసముతీసి కొద్దిగా వుండగనే చెవిలో పోయవలెను.

4. నీటిపిప్పలి ఆకురసమును చెవిలో పోయవలెను చాలా ప్రశస్తమైనది.

5. ఆవు పంచితముతో మారేడు పండును నూరి అందులో కొంచెము నీరు, మేకపాలు, నూనెకలిపి కాచి చెవిలో పోయవలెను.

6. నువ్వులనూనె తులము, జిల్లేడాకులరసము తులము

కాచి చెవుడున్న చెవులలో మూడుపూటలు పోసిన తగ్గిపోవును.

7. ప్రత్తి గింజల నూనె తీయించి ఆ నూనెలో ఏడాకులు పొన్నచెట్టు వేరు వేసి కాచి చెవులో పోయుచుండవలయును.

8 చిరువల్లేరాకుల రసం తీసి పోయువలెను.

## జలుబు (రొంప) (పడిశము)

1. నీటిని మరగ కాచి పసుపు వేసి ఆవిరి ముఖమునకు పట్టవలయును.

2. శొంఠి చూర్ణము పది తులములు, పదిహేను తులములు వేడి నీళ్ళలో వేసి పరుండబోవునప్పుడు పుచ్చుకొనవలయును.

3. నల్ల జీలకఱ్ఱను గుడ్డలో మూటకట్టి నలిపి పీల్చుచుండవలెను.

4. కాచిన పాలలో మిరియాల పొడి వేసి పుచ్చుకొనవలయును.

5. మిరియాల కషాయము పుచ్చుకొనవలెను.

## జ్వరము

1. రాత్రిపూట నీళ్ళలో ధనియాలను నానవేసి ఉదయమున పిసికి పిప్పి పారవేసి ఆ నీటిని పంచదార కలిపి పుచ్చుకొనిన యెడ[illegible]రతాపము హరించును.

[illegible] వెచ్చచేసి తీసిన రసము పూటకు

తులము మొదలు మూడు తులముల వరకు పుచ్చుకొనిన జ్వరము తగ్గించును.

3. పిప్పళ్ళను వేసి కాచిన ఉదకము, వాత శ్లేష్మ జ్వరమును ప్లీహ జ్వరమును పోగొట్టి, అగ్ని దీపనమును కలిగించును.

4. వెల్లుల్లి రసము, నువ్వుల నూనె కలిపి పుచ్చుకొనిన విషమ జ్వరములు మానును.

5. పరువ జ్వరమునకు అతివస చూర్ణమును నీళ్ళలో కలిపి జ్వరము వదలుటకు ముందు చెమట పట్టినపుడు ప్రారంభించి ప్రతి నాలుగు లేక ఆరు గంటల కొకసారి జ్వరము లేనపుడు యివ్వవలెను. మోతాదు పెద్దలకు ముప్పయి గోధుమ గింజల ఎత్తు, బిడ్డలకు పది, ఇరవై గోధుమ గింజల ఎత్తు.

6. రెండు మూడు మిరియపు గింజలను సాధారణ ఉష్ణముగల నీరుల్లిపాయను కలిపి ప్రతి రోజు రెండు పూటల తినుచున్న యెడల మన్యపు జ్వరము నివర్తించును.

7. అయిదు లేక ఏడు మిరియములు రాత్రి సుమారు రెండు తులముల ఎత్తు ఆవు మజ్జిగలో నానవేసి ఉదయమున ఆ మిరియములను ఆ మజ్జిగతో నూరి అందులో ఒక గురిగింజ ఎత్తు మొదలు నాలుగు గురుగింజల యెత్తు వరకు రస సింధూరము చూర్ణించి కలిపి సుమారు వారము దినములు ఇచ్చిన పురాణ మేహజ్వరములు, అహిక జ్వరములు కట్టును. ఉదయము మాత్రమే ఇవ్వవలెను.

8. పుల్లని వస్తువులను నూరియైనను, శీతలమగు మజ్జిగ మొదలగువాని నైనను, మోదుగ ఆకులను నూరియైనను, శేగు చిగుళ్ళనుగాని, వేప చిగుళ్ళనుగాని నూరియైనను లేప నము చేసిన పిత్తజ్వర తాపము హరించును.

9. అవిశెఆకు రసము ముక్కులో పిండిన చెడుజ్వరము యొక్క ఉద్రేకము అణుగును.

10. ఉత్తరేణి పచ్చిఆకులలో కొద్దిగ మిరియములు, కొద్దిగ వెల్లుల్లిపాయలు చేర్చి, నూరి గచ్చకాయలంత పరి మాణమున మాత్రలు చేసి చలిజ్వరము రాకపూర్వము యిచ్చుచుండిన చలిజ్వరము, వరుస జ్వరము నివర్తించును.

11. పొగడపువ్వుల చూర్ణము నస్యముచేసిన తీవ్ర జ్వరము, తలనొప్పి, పడిశము, శరీరమంతా నొప్పులతో వచ్చు జ్వరము నయమగును.

12. అయిదు గురిగింజల యెత్తు ప్రమాణము పిప్పలి చూర్ణమున తేనె కలిపి పుచ్చుకొనిన కాసజ్వరము, ఎక్కిళ్ళు, శ్వాస, ప్లీహా రోగమును హరింపచేసి కంఠమునకు మేలును గూర్చును.

13. ఉత్తరేణి వేరు అయిదు గోధుమ గింజల ఎత్తు మిరియాలు అయిదు గోధుమ గింజల ఎత్తు కలిపి మాత్రచేసి ఇచ్చిన వరుస జ్వరము, చలి జ్వరము కట్టును.

14. పాము కుబుసమును దేహముయొక్క యే భాగము నందు కట్టినను విడువని జ్వరముకూడా విడుచును.

15. అనుదినము ఉదయపు పూటలందు గుంటకలగర చిగుళ్ళు మూడు, మిరియపుగింజలు మూడు చొప్పున పది హేను లేక ఇరవై దినములు తినిన మహాజ్వరము, అస్తిగత,

పురాణ, ఆహిక జ్వరములు, పాండు మొదలగు రోగములు నివర్తించును.

16 తెల్ల పారిజాతపు ఆకులలో కొద్దిగ అల్లము వేసి నూరి యిచ్చిన విరుసజ్వరము నివర్తించును. ఆకుల రసము బిడ్డలకు హరించును. రసపు మోతాదు రెండు మూడు తులములు.

17. పారిజాతపు ఆకుల రసములో కొద్దిగ తేనెగలిపి యిచ్చిన పురాణజ్వరములు కట్టును.

18. మంచిగంధపు చూర్ణమును నీళ్ళలో కలిపి పుచ్చుకొనిన తాపజ్వరము నయమగును. చెమట బట్టించును.

19. సున్నము, కొట్టుపసుపు సమముగా నీళ్ళలో కలిపి యించువకాయలంతేసి మాత్రలుచేసి పూటకు ఒక్కొక్క మాత్ర చొప్పున మూడు, అయిదు దినములు యిచ్చిన చలి జ్వరము, విరుసజ్వరము నిర్మూలించును.

20. బేడెత్తు మొదలు పావలాయెత్తు వరకు వేపచిగుళ్లు వాటి కాడలసహా మూడు, అయిదు మిరియములతో కొన్ని వారములు ప్రొద్దుట పూట తినిన మేహములు, పురాణ విరుస జ్వరము నివర్తించును.

21. వేపకాడ కషాయము గంట కొకసారి ఇచ్చిన విడిచి విడిచి వచ్చే జ్వరము హరించును. క్వినయిను యివ్వ సరిపడని సుకుమార తత్వము గలవారికి పురాణ జ్వరము ఉన్నప్పుడు దానికి బదులు వేప చూర్ణమును ఇవ్వవలయును.

22. మిరియాలు, తెల్ల కాకరాకు పసరులో వేసి నూరి ఇచ్చిన యెడల చలిజ్వరము తగ్గిపోవును.

23. ఏడు తెల్ల ఉప్పి ఆకులు, ఏడు తమలపాకులు

ఉదయమున నే పోక చెక్క సున్నముతో తాంబూలము వేసు కొను చుండిన యెడల శీతల జ్వరములు హరించును.

24. గుంట కలగరాకు చిగుళ్ళు ఏడు మిరియాలు ఏడు నూరి ప్రతిరోజున ఉదయపు పూట మూడు రోజులు ఇచ్చిన యెడల చలి జ్వరములు, జ్వరములు తగ్గిపోవును. తరువాత కూడా కొన్ని రోజులు పుచ్చుకొన వచ్చును.

25. కావ జ్వరమునకు వేప చిగురు అయిదు తుల ములు, పిప్పళ్ళు అర తులము నూరి నీళ్ళతో కలిపి మూడు రోజులు యివ్వవలెను.

26 ఒక గచ్చకాయలోని పప్పు, మూడు మిరియాలు నీళ్ళతో నూరి మూడు మాత్రలు చేసి, మూడు రోజుల కొక సారి వచ్చే జ్వరములకు నేలవేము కషాయముతో రెండు గంటలకు జ్వరము వచ్చుననగా రెండు మాత్రలను తరువాత ఒక మాత్రను ఇవ్వవలెను. జ్వరము రాకపోయిన యెడల మూడు మాత్రలు ఇవ్వవలెను. గచ్చపప్పు, చిట్టాముదముతో నూరి నూనెలో కలిపి బొడ్డుకు రాసిన యెడల మరాత్రము వచ్చును.

27. ఒక ఝామునకు శీత జ్వరము వచ్చుననగా పద మూడు తమలపాకులు, పదమూడు తెల్ల ఉప్పిఆకులు చొప్పున ఈ ప్రకారము మూడు చలిజ్వరము వరుసలకు నమలవలెను.

28. మిరియాలు, రస సింధూరం, కరిధూవము వీటిని సమాంశములుగ తెచ్చి తమలపాకు రసముతో మాత్రలు గట్టి అల్లపురసపు అనుపానముతో రెండు పూటల మూడు రోజులు ఇచ్చిన యెడల అసాధ్యసంగమ దోషము హరించును. చల్ల, పులుసు పుచ్చుకొనగూడదు.

29. కోసి ఎండబెట్టిన బెండకాయ ముక్కలు ఏడు తులములు, అరవయి తులముల నీటిలో వేసి మరగబెట్టి ఆ నీటిని అప్పుడప్పుడిచ్చుచుండవలెను. ఇగ మొదట జ్వరమునకు కూడా చాలా పని చేయును.

30. ఆవాల పిండి పాదములకు గుడ్డపై పట్టించి పట్టు వేసిన తీవ్ర జ్వరములు కూడా తగ్గును.

## డోకు

1. అల్లపు ముక్కలను తేనెలో నానవేసి తినుచుండిన అరుచి డోకు కట్టును. (మాధవ నిదానము)

2. ఉసిరిక రసము తేనె, మంచి గంధమును కలిపి తినుచుండుట వలన పైత్య ఉడుకు డోకులు తగ్గును.

3. వసువు పొడిని పుల్లని కలితో యిచ్చినడోకులు కట్టును.

4. కరక్కాయ పొడిని తేనెతో యిచ్చిన సమస్త పైత్య దోషములును, డోకులును హరించును.

5. నెమలి ఈకలమసి, తేనె కలిపి యిచ్చిన వాంతి వెక్కిళ్ళు కట్టును. ఇది చిన్నపిల్లలకు చాల మంచిది.

6. రావిచెట్టు పట్టను కాల్చి, మసిచేసి నీళ్ళలో కలిపి త్రాగించిన డోకులు వెంటనే కట్టును.

7. శొంఠి రసములోగాని జీలకర్ర, ధనియాలు, నిమ్మకాయ రసములలో శొంఠియు చక్కెర, తేనె కలిపి యిచ్చిన వమనములు తగ్గును.

## తలనొప్పి (పార్శ్వనొప్పి)

1. శొంఠి గంధము తలకు పట్టు వేయవలెను.

2. నిమ్మరసముతో ఉప్పు, బెల్లము, నూరిరాయవలెను.

3. ఆవు నేతితో నల్లఉమ్మెత్త వేరు చూర్ణము కాచి రాయవలయును.

4. సూచిగంధము కణతలకు పట్టు వేయవలెను.

5. ఆముదముగాని మరేవిధమగు విరేచన సాధనము గాని చేయవలయును.

6. బాగా చన్నీళ్లలోనైనను, వేన్నీళ్ళలో నైనను గుడ్డ తడిపి ముఖమునకు అద్దవలయును.

7. కొంచెము అల్లమును కొద్ది బెల్లమువేసి నూరి గుడ్డలోవుంచి ఏవైపు నొప్పి వచ్చుచున్నదో ఆ ఎదురువైపు ముక్కులో నాలుగైదు చుక్కల రసము పిండవలెను. తరువాత తలమీద స్నానము చేయవలెను.

8 వేన్నీళ్లలో గుడ్డతడిపి కావడము పెట్టిన జ్వరములో వచ్చునది నయమగును.

9. త్వరగా పోకుండా వున్న యెడల కొంచెము ఆముదము ఇచ్చి విరేచనము చేయించవలెను,

10. మందుగడ్డ నైనను చల్లటి నీటినైనను నొప్పిగల భాగములపై నుంచవలెను.

11. జ్వరముకూడ వున్న యెడల నిమ్మకాయ రసమును వెచ్చచేసి రెండుమూడు చుక్కలు చెవిలో పోయవలెను.

12. ఉత్తరేణిఆకు పసరును చెవిలో ప్రతిరోజు వరగడుపున పోయుచుండిన పార్శ్వపునొప్పి తగ్గిపోవును.

## తాపము

1. ధనియాలను వలగొట్టి రాత్రి నీళ్లలో నానవేసి ఉదయమున పంచదార కలిపి పుచ్చుకొనవలెను. అనన్నూనె,

కారము వర్జితము. ఎక్కువగనుండిన ఉదయము నానబెట్టి సాయంత్రమున విరివిగ పుచ్చుకొననగును.

## తామర (చిడుము, గజ్జి, చూడుము)

1. కిరసనాయిలును ప్రతిరోజు మూడుసార్లు పూసి తరువాత కొబ్బరినూనెను రాయవలయును.

2. అరతులము వెలిగారము అయిదు తులముల కల్లులో వేసి మర్దన చేయవలెను.

3. కొబ్బరిచిప్పల తైలము చిప్పలకాచి తీసి రాయవలయును.

4. ఆవాలు, నల్లమందును నీళ్లతో నూరి రాయవలయును.

5. పుగాకుకాడలు కాల్చి మసిచేసి దానిని మంచినూనెలో గలిపి పూయవలయును.

6. గన్నేరు ఆకులు నూనెతో నూరి రాయవలెను.

7. కసింద సమూలము ఎండినచూర్ణము తేనెలో పూయవలెను.

8. నిమ్మకాయనుకోసి బద్దతో దానిమీద [illegible] వలెను.

## లొండ కొటు

1. జిల్లేడువేరు చూర్ణము కొద్దిగాగాని, మునుగాని నీళ్లతో ఉదయముననే రెండు మూ పుచ్చుకొనవలెను.

# తేలు కాటు

1. నీరుల్లిపాయను మధ్యకుకోసి కొంచెము సున్నము చల్లి కుట్టినచోట రుద్దవలయును.

2. పుగాకును ఉమ్మితోగాని నీటిలోగాని నలిపి కుట్టిన చోట రుద్దవలెను.

3. కుట్టినవెంటనే తలారా స్నానము చేయవలెను.

4. జీలకఱ్ఱ, ఉప్పు, తేనె, నెయ్యి. నూరి కుట్టినచోట పట్టు వేయవలెను.

5. నీటిలో ఇంగువను అరగదీసి పట్టు వేయవలెను.

6. జిల్లేడువేరుగాని, నల్ల ఉమ్మెత్తవేరుగాని గంధము తీసి రాయవలయును.

7. మంచితేనెను కొంచెము నాకవలయును. వాని ఉమ్మిని కుట్టినచోట రాయించి ఆరినతరువాత తేనె రాయవలెను. ఒకనీరుల్లిపాయను నమిలి హారతికర్పూరము వాసన వలెను. కుట్టిన తక్షణమే ఇటుల చేసిన బాధ పోవును.

8. తలార స్నానంచేయించి కుంకుడుకాయ తొక్క, 5 తమలపాకులు సున్నంతో తాంబూలం

పటికను వేడిచేసి తేలు కుట్టినచోట అంటించవలెను.
నీరుల్లిపాయ రసముతో మైల తుత్తమును అరగ
గోట వేసి మర్దనచేసిన తప్పక తగ్గిపోవును. ఇంకొక
కుకముందు చేయవలయును. ప్రతివారును వాడ
కమంది సుఖపడిరి.

## తెల్లమచ్చలు

1. జరిసినాకు, గజ్జేరు ఆకు రసము కలిపి రాచేది.

2. చిత్రమూలం, కరక్కాయలు, సిమ్మరసాన నూరి వుంచుకొని రాయుచుండవలెను.

## దగ్గు

1. పట్టి నోటను వెన్నను దినుచుండిన వేడిచే గల్గిన పొడిదగ్గు మానును.

2. ఆముదములో తమలపాకులు వెచ్చచేసి గుండెలపైని వేయవలెను.

3. తేనెను తమలపాకుల రసములో కలిపి పోసిన యెడల బిడ్డల దగ్గులు శ్లేష్మము హరించును.

4. నొప్పిగా యున్నచో గుండెలపైన ఆవాలపిండి పట్టు వేయవలెను.

5. కొద్ది వసుపుగుండ కొంచెము పాలలో కలిపి మిరియాలపొడి కూడా కలిపి దినమునకు రెండుపూటల నిచ్చుచుండిన జ్వరముగల దగ్గు వడిశము ని [illegible]

6. మిరియాలను తేలిక కషా [illegible] క్కలించుచుండిన కొండనాలుక వాలడము ని [illegible]

7. అయిదు తులముల [illegible]
వది, వస [illegible] చి ఆ [illegible]

జుకు రెండుపూటల నాకిచ్చిన పిల్లలకు వచ్చు కొంత తగ్గిపోవును.

9. శొ౦ఠి. పిప్పళ్ళు, మిరియాలు సమ భాగములుగా చేసిన చూర్ణమును కొంచెము బెల్లము కలిపి యివ్వవలయును.

10. ఉక్కిరబిక్కిర దగ్గులకు పిల్లల మెడలో గానుగకాయలు దండగా కట్టి వేయవలెను.

11. తేనె, మిరియాల చూర్ణము కలిపి పుచ్చుకొనిన నరసదగ్గు తగ్గిపోవును.

12. గానుగకాయలో పప్పును కొంచెము తేనెతో కలిపి తిన్న యెడల వుక్కిరదగ్గు తగ్గిపోవును.

13. ఆవునేతిలో చలువ మిరియాల చూర్ణము కలిపి రోజుకు మూడుపూటల యిచ్చినయెడల వృద్ధులకు వచ్చు దగ్గు నివర్తించును.

14. ఇంగువను పొంగించి చూర్ణముచేసి వది ధాన్యపు గింజలయెత్తు చూర్ణమును ఆవునేతితో కలిపి ప్రతిరోజు మూడుపూటలు యివ్వవలయును.

15. ఒక జౌన్సు నీళ్ళలో దమనము రసము మూడు బొట్లువేసి రోజుకు ఒక్కసారిగాని, రెండు సార్లుగాని రోగ బలిమినిబట్టి పి[illegible]యిచ్చినయెడల కోరింతదగ్గులు నివర్తించును

1[illegible] [illegible]ంచి కొంచెము పసుపువేసి ఆవిరి

[illegible]లో వేసి [illegible], దానిని

18. చలువమిరియాల చూర్ణమును కొంచెము ఆవు నేతిలో కలిపి ముప్పొద్దూ యిచ్చేది. ఇది వృద్ధుల కుప యోగము.

## దద్దుర్లు

1. తుమ్మెదకూడు మన్నును కొబ్బరినూనెలో నూరి రాచినయెడల శరీరముమీద దద్దుర్లు తగ్గిపోవును.

2. నీలిమందు నూనెలో కలిపి పూయవలెను.

3. బొడ్డ కాకర, సమూలము ఆముదములోగాని, నూనెలోగాని వేసి కాచి పూసిన పైత్య దద్దుర్లు పోవును.

4. గన్నేరుచెక్క లేక వేరుచెక్కను నూరి నూనెలో గాని, నేతిలోగాని వేసి కాచి పూయవలెను.

5. నిమ్మకాయ రసమును పూయవలెను.

6. నారింజకాయ రసమును లోపలికిచ్చి దద్దుర్లపై తొక్కలను రాయవలెను.

## దాహము (విదాహము)

1. నాలుగు తులముల నూనె, చింతాకురసము నాలుగు తులములు కలిపి తలకు, నాభికి, అరికాళ్లకు మర్దన చేయవలయును. ఎండదెబ్బ తగ్గిపోవును. రోగముచే ప్రతిరోజు కలుగు దాహముకూడా తగ్గును.

2. వట్టివేళ్ల కషాయముగాని, వేళ్ళను నీళ్ళలో నానవేసిన నీళ్లనుగాని యియ్యవలెను.

3. పంచదార, నిమ్మపువ్వుగాని, నిమ్మకాయ రసముగాని కలిపి నీరుపోసుకొని త్రాగవలెను.

4. తెల్లవారు ఝామున శనగలు నానవేసిన నీటిలో తేనె కలిపి తాగవలయును.

## దోమలు

1. తెల్ల ఆవాలను చూర్ణించి ధూపము వేయవలెను.

## దుర్గంధము

1. చింతాకు రసము, పాలు, పసుపు గుండను కలిపి చంకలలో నలుగుపెట్టిన దుర్గంధము పోవును.

2. ఉమ్మెత్తాకు రసమును, పసుపును, పాలును వేసి నూరి నలుగుపెట్టిన శరీర దుర్గంధము పోవును.

## దెబ్బలు - వాపులు

1. గాడిద గడపాకు నూరి కట్టుకట్టిన ఆయుధపు దెబ్బలు వాపులు కూడా మానును.

2. నల్లమందు, నూనె కలిపి కాచి వేడిగానున్నప్పుడు విష్ణుక్రాంత బద్దతో కాచవలెను.

3. పసుపు, కలబంద నూరి కాకు దెబ్బలకు కట్టవలెను.

4. పసుపు తడిపి రాయవలెను.

5. నల్లరాయిని చూర్ణముచేసి, వెచ్చజేసి కాచవలెను.

## నడుము నొప్పి

1. కొబ్బరి నూనెలో నల్లమందు కలిపి మర్దన చేయవలెను.

2. ఉమ్మెత్తాకులు, బియ్యము సమభాగములు నీటిలో నూరి గుడ్డమీదరాచి అంటించవలెను.

3. నల్లమందు, రసకర్పూరము, కొబ్బరినూనె కలిపి మర్దన చేయవలయును.

4. విరేచనములకు ఆముదమును తీసుకొనవలెను.

# నల్లులు

1. కర్పూరతైలము, కిరసనాయలును కలిపి నల్లులున్న సందులలో పోయవలెను.

# నత్తి

1. తేనెలో మొమ్మాయి కలిపి నాలుకకు పట్టించవలయును.

2. సంగీతము, దీర్ఘముగా అక్షరములను అభ్యసింప చేయవలెను.

# నపుంసకత్వము

(వీర్యవృద్ధి, ఇంద్రియ నష్టము చూడుడు)

1. కుక్కపొగాకు సమూలరసము, అరతులము పటిక బెల్లము, చలవ మిరియాలు అరతులము, జావత్రి, యాలక్కాయలు పావుతులము నూరి శనగగింజంత మాత్ర చొప్పున యిచ్చాభవత్యముతో యివ్వవలయును.

2. నాలుగైదు చిన్నముల ఎత్తు బోడతరపు విత్తనములు అందుకు సమము శర్కర కలిపి ఒక సంవత్సరము పుచ్చుకొనవలెను.

3. నల్ల ఉమ్మెత్తగింజలు తెచ్చి, నూనె తీయించి ఆ

నూనెను జాగ్రత్తచేసి ఒక సీసాలో ఉంచి ప్రతిరోజు రెండు పూటల అంగమునకు పూయవలెను.

4. వామును ఒక పింగాణీ గిన్నెలో వేసి నిమ్మ పండ్ల రసము అది మునుగు వరకు పోసి ఆరబెట్టుచు ఇటుల ఆరు న్నొక్క సారి చేసి యుంచుకొని ప్రతి ప్రాతఃకాలమున పుచ్చుకొనవలయును.

5. కుంకుమ పువ్వు 2 భాగములు, నల్లమందు 3 భాగములు, కస్తూరి 1 భాగము, జాజికాయ 9 భాగములు, లవంగములు 6 భాగములు, వీనిని చక్కగా చూర్ణించి తేనెతో మర్దించి శనగలవలె మాత్రల జేసి రాత్రి కాలముల యందు క్షీరముల బుచ్చుకొనిన బహుమంది స్త్రీలతో భోగించు శక్తి కలుగుటయే గాక నపుంసకత్వమును నివారించునని వైద్య కుతూహలములో వ్రాయబడియెను.

## నంజు

1. తెల్ల జిల్లేడుఆకు రసమును వకటిరెండు చుక్కలు ఆవుపాలలో వేసి పుచ్చుకొనుచుండవలెను.

2. ప్రతిరోజు ఉదయము సాయంత్రములు నారింజపండ్లు ఆవుపాలు పుచ్చుకొనుచుండిన తగ్గిపోవును.

## నరములు

1. ఆవనూనె మర్దనవలన నరములు బలపడును.

2. వెన్నలో కసిందఆకు రసము కలిపి మర్దన చేయవలయును.

3. ఆముదములో గానుగవేరు నలియగొట్టి వేసి కాచి రుద్దవలెను.

## నాలుక పూత (నోటిపూత)

1. మంచి గంధములో కొంచెము పచ్చ కర్పూ రకలిపి సేవించిన యెడల నయమగును.

2. పటిక ముక్క పుక్కిట పెట్టుకొనినను పొంగిం పిలిగారము తేనె కలిపి రాయుచుండినను నిమ్మళించును.

3. కొబ్బరి పుచ్చును గాని, ముక్కగాని అరగ నాలుకకు రాచిన యెడల నయమగును.

4. పేరి నేతినిగాని, వెన్నను గాని నాలుకకు రా యెడల మంచి పని చేయును.

5. పరిన నెయ్యి రాయవలయును. నీలి ఆకును న లుతూ వుండేది.

6. సుద్ద నీటిలో అరగదీసి రాయవలయును.

7. మారేల కాయను తేనెతో అరగదీసి యాల పొడి కలిపి రాసేది.

8. యాలుకలు, జీలకర్ర, అతి మధురం చూర్ణిం పంచదార, తేనె కలిపి యిచ్చేది.

## నాసిక రోగములు

1. నీరుల్లిపాయ రసము ముక్కులో పిండిన మాత్ర వెంట నీరు కారడము మొదలగు సమస్త నాసిక రోగముల నివర్తించును.

## నులి పురుగులు (క్రిములు)

1. వేపాకు అరతులము, ఇంగువ పావుతులము, తేనెతో నూరించి ఆరు మాత్రలుచేసి పూటకు రెండు మాత్రలు చొప్పున యివ్వవలయును.

# నారి కురుపులు

1. వంకాయముక్కలను వేయించి పెరుగుతో నూరి ...ము కట్టవలయును.

2 నరమూత్రములో వసుపు కలిపి కట్టవలయును.

3. పొంగించిన వెలిగారము, ఇంగువ పూటకు రెండు ...ములు చొప్పున రోజుకు రెండు పూటలు వారము ...లు ఇవ్వవలయును.

4. తేనెలో పాపురము రెట్టలు కలిపి రాయవలెను. ...రోజు ఉపయమున యీమందు లోనికివ్వవలెను. (వైద్య ...శాస్త్రము).

5. మంచుగడ్డ కురుపు పైన పెట్టిన నారియంతయు ...పురికొనుకు వచ్చును.

6. ఇ...ను కొద్దిగా ఆ కురుపుపై ఉంచవలెను.

7. ములగఆకు నూరి కురుపు మీద వేసి కట్టవలెను.

8. హారతి కర్పూరము, శీతాఫలపు ఆకు నూరి కట్ట...ను.

9. పావురపు రెట్ట బెల్లము కలిపి వేయవలెను.

10. నల్లతుమ్మ విత్తులు గోమూత్రంతో నూరి లేప...నము చేసేది. ఉడికించి కట్టగా కూడ కట్టవలెను.

11. వంకాయను భాండమునందుంచి వేయించి పెరు...గులో కలిపి కట్టుకట్టుచుండిన 7 రోజులలో నారి బయలు ...పడలును.

12. ఆముదపు వేరు రసమును గోమూత్రంతో ఏడు దివములు పుచ్చుకొనిన నివర్తించును.

2. నూట ఇరవైతులముల మంచినీటిలో, దానిమ్మ చెక్క అయిదు తులములు వేసి నాలగవభాగము మిగులు నటుల యిగరకాచి ఉదయమున ఏడు తులములు పుచ్చుకొని అంతటనుండి గంటకు యాడుతులములచొప్పున సాయంకాలం వరకు పుచ్చుకొనిన కడుపులో పురుగులు పడిపోవును.

# నేత్రరోగములు

1. పావుతులము పటిక చూర్ణమును కోడిగుడ్డుసొనతో నూరి నేత్రములపైన పత్తిగా వేసిన యెడల అనగా గుడ్డపీలికకు పట్టించి నేత్రములపైని వేసినయెడల కండ్లనీరుగారుట, వాపు తగ్గిపోవును.

2. ములగాకురసమును తేనెతో గలిపి కన్నులకు వేసిన సమస్తనేత్రరోగములు హరించును.

3. ఇనప గరిటలో నిమ్మపండ్ల రసము వేసి కొంచెము గట్టిపడువరకు ఇనుముతో మర్దించి నేత్రములచుట్టు పట్టు వేసిన కండ్లకురద మొదలగు నేత్రరోగములు హరించును.

4. చేమంతిపువ్వులు పదితులములు, ఇరవయి తులముల మంచినీళ్లలో నానవేసి కాచి ఆనీటిలో కండ్లను కడుగు చుండిన మంటలు తగ్గిపోవును.

5. పచ్చకర్పూరము పావుతులము, చక్కెర పావు తులము, తులమెత్తు ఆవువెన్నలో మర్దన చేసి కంటి రెప్పలకు తరుచు కాటుకగ బెట్టుచుండిన కండ్లమంటలు హరించును.

6. 20 తులముల నీటిలో ఒక తులము పటిక వేసి, కలిపి, అందులో రెండు తులముల నీళ్ళను కంటికి పిచికారి చేయవలయును.

## నోటియిగురు

1. అతిమధురము (యష్టి మధుకము) కషాయముగా కాచి జ్వరములు మొదలగు రోగదశయందు యిచ్చిన నోటి వెంట నీరూరచేయును.

2. అజీర్ణము మొదలగువాటిచే బాధపడునపుడుగాని, పక్ష వాతము, మూర్ఛ మొదలగు నరముల జబ్బుదశయందుగాని, కలరా మొదలగు అంటువ్యాధులయందు నయితము అక్కల కర్ర కషాయము కాచి ఇచ్చినచో నోటియందు నీరూరుటయేగాక శరీరతత్వమునుగూడ మంచి స్థితికి మార్చును.

## నోటివెంట అధికముగా నీరూరుట

1. మంచు గడ్డలను నోటియందుంచుటవలన తగ్గును.

2. బాగా వేడినీటిని నోటిలో పోసుకొని పుక్కిలించు చుండిన తగ్గగలదు.

3. కొంచెము కాఫీనిగాని, మిరియాల కషాయమును గాని యిచ్చిన తగ్గును.

## నోటి దుర్గంధము

1. పైత్య జ్వరములలోను, దంతరోగములున్నప్పుడును ఎక్కిళ్లు, కఫకూలతోనుండి నోరు వాసనగా నున్నప్పుడును సహజ స్వభావముగా నోరు దుర్వాసనగా నుండినప్పుడును కొబ్బరినుండి పాలుతీసి, నోటియందుంచుకొను చుండిన దుర్వాసన పోవును. లోపలికి పోయినను జబ్బుచేయదు.

2. తేయాకు నీరు పుచ్చుకొనుటవలనకూడా నోటి దుర్గంధము తగ్గును.

3. తాంబూలములో దాల్చిన చెక్క ఎక్కువగాగాని, ప్రత్యేకము లవంగము, కొంత దాల్చిన చెక్కగాని లేక దాల్చిన చెక్కనేగాని నోటియందుంచుకొని అప్పుడప్పుడు నమలు చుండిన దుర్గంధము పోవును.

4. పోక చెక్కలు జాజికాయ, ఏలాలు సమభాగములు తేనెతో మర్దించి మాత్రలుచేసి వుంచుకొని ప్రతిరోజు ప్రాతః కాలమున ఒక గ్లాసెడు నీళ్లతో వేసుకొనుచుండిన నోటి దుర్గంధము హరించును.

5. కరక్కాయ పెచ్చును కాల్చి వుంచుకొని ప్రతిరాత్రి పరుండబోవునప్పుడు నోటవుంచుకొని ద్రవము మ్రింగుచుండ వలెను.

6. నోటి పూత, నోటి దుర్గంధమునకు పెద్ద వల్లేరు సమూల రసములో తేనె కలిపి పుక్కిలించిన నివర్తించును.

7. తాంబూలము ప్రతిరోజు వేసుకొనుట, అందు సున్నము, లవంగములు కొద్దిపాటి ఎక్కువగా వేసుకొన వలెను.

8. లవంగము నోక్కొక్కదానిని నోట ఉంచుకొన వలెను.

## నోరు తాంబూలములో సున్నము ఎక్కువచే పొక్కుట

1. మంచినూనె, పంచదార, కలిసీళ్ళు కలిపి పుక్కిట నుంచుకొనిన వెంటనే తగ్గును.

## నోటిపూత (నాలుకపూత మాడుటకు)

1. మాఫలకాయ గంధము అరగదీసి రాయవలెను.

2. కొత్తిమిరి కషాయమును పుక్కిలించుచుండవలెను.

3. కానుగ పుల్లతో దంతధావన చేయవలెను.

4. నీలి ఆకును నూరి బుగ్గనుంచుకొనవలెను.

## పడిశము

1. ముక్కుపయిన వస గంధము పూయవలయును.

2. మొట్టమొదట కొద్దిగ తాజాగా చేసిన పొడుమును పీల్చవలయును.

3. నల్లమందు, శొంఠిగంధము కలిపి ముక్కుపై పట్టు వేయవలెను.

4. ప్రతి దినము రెండుపూటల పాలలో పసుపు, మిరియాల పొడి బాగుగా వేసి పుచ్చుకొనవలెను.

5. నిప్పులమీద వాము వేసి పీల్చవలెను.

6 నీళ్ళను కాగులోపోసి కాచి, అందులో పసుపు గుండవేసి శరీరమునకు పట్టుటే కాక ముక్కుద్వారా ఎక్కువగా పీల్చవలెను.

## పన్ను

1. ఒక కుండలో గవ్వలను ముక్కలుగొట్టి పోసి వాటి మీద జీడిగింజలువేసి చమురు ఇగిరేవరకు వేయించి తరువాత తీసి పొడిచేసి దానితో పళ్లు తోమిన సమస్త రోగములు నయమగును.

2. పళ్లు కదలుచున్నయెడల తెల్ల తుమ్మ పుల్లగాని, నేపాలపు వేరుగాని పుడికించి దానితో దంతధావన చేయవలయును.

3. ఉప్పు, నల్లజీడిగింజలు సమభాగములు కలిపి ఒక ముంతలో పోసి పైన మూకుడు వేసి సీలమన్ను రాచి నలువుపుల పుడకలతో పుటం పెట్టి నిప్పు చల్లార్చిన తరువాత వాటిమీద మన్ను పోసి వుంచి మరునాడు తీసి చూర్ణము చేసి తోమిన పండ్ల వెంట నెత్తురు కారుట మొదలగు సమస్త రోగములు పోవును.

4. కొంచెము కాచు ముక్కను పండ్లమీద నుంచి దినము ఉమ్మి వేయుచుండిన దంతములు కదలుట వాపు మున్నగునవి హరించును.

5. కుప్పింట ఆకును నలి పి పిప్పి పన్నుపై బెట్టిన నొప్పి తగ్గును.

6. సీమ బాదంకాయ పెంకులను కాల్చి మసితో పండ్లను తోమిన గట్టిపడును.

## పక్షవాతము

1. ప్రతిరోజు రెండుపూటల అడవి పావురము రెట్టలు మర్దన చేయవలెను. పావురమాంసమును గోధుమరొట్టెతో తినిపించవలెను.

2. నీళ్లతో జాజికాయను నూరి పట్టువేయవలెను.

3. ఆవాలలో నీళ్లుపోసి నూరి పట్టువేయవలెను.

4. మిరియాలను నీళ్ళతో నూరి గచ్చకాయంత మాత్ర పూటవక్కంటికి వక్కటి చొప్పున రెండుపూటలు వేసుకొనవలెను.

5. తేనెను త్రాగించవలెను. ఎంతత్రాగించిన అంత మంచిది. ఏమందులు అక్కరలేకుండగనే ప్రప్రథమున నిదివిగ నిచ్చిన పూర్తిగ తగ్గి ఆరోగ్యవంతులు, బలవంతులు అగుదురు.

6. అయిదారు చిన్నముల ఎత్తు దుష్టవువేసు రసము లోపలికిచ్చిన దారుణ పక్షవాతము నయమగును.

# పాండువు

1. ఆవుపాలలో పదిహేనవ వంతు ఆవపిండి వేసి ప్రతి రోజు పదిసార్లు అప్పుడప్పుడు పుచ్చుకొనవలెను.

2. తేన, వేపాకు పసరు పక్కొక్కటి రెండేసి తుల ములు కలిపి ప్రతిరోజు ప్రాతఃకాలమున పుచ్చుకొనుచుండ వలెను.

3. గొబ్బిగూర పండి తినుచుండవలెను.

4. ప్రతిరోజు రెండుపూటలు జిల్లేడికాయల చూర్ణము పదిగోధుమ గింజలఎత్తు పది మిరియాలు కలిపి చూర్ణము చేసి ఇవ్వవలయును. అర్ధశేరు పాలవిరుగుడునీళ్ళలో పక తులం పావు నల్లఉప్పు కలిపి ఇచ్చిన ఎడల వారము పది రోజులకే నయ మగును.

5. కరక్కాయ చూర్ణమునందు తేన, నేయి కలిపి భక్షించవలెను.

# పాముకాటు

1. వంటిరేక వెల్లుల్లిపాయను రెండు ముక్కలుగ కోసి పకముక్కను పాముగరచినచోట న ం టి ం చి న విషము హరించును.

2. తిప్పవేరు చూర్ణము ఇరవయి గోధుమగింజల ఎత్తు ఇరవయి నిముషముల కొకసారి చొప్పున మూడుసార్లు ఇవ్వవలయును. వాంతిజేసి బాగుచేయును.

3. ఏనుగపల్లేరు సమూలము రెండు మూడు తులములలో తగు మాత్రము సారాయి కలిపి పుచ్చుకొనవలెను.

4. నేలవేము సమూలరసము లోనికి ఇవ్వవలెను.

5. పుగాకు మంచినూనెలో పిసికి రెండు ఔన్సులు లోనికి ఇవ్వవలెను.

6. జిల్లేడు ఆకులపైనవుండు తెల్లటి పొడిని గీచి జిల్లేడు పాలలో కలిపి పెద్దపెద్దవుండలు చేసి తమలపాకులో పెట్టి నమలించవలెను. ఇట్లు అరగంట కొకసారి చొప్పున మ్రింగించవలెను. వంటికి తిమ్మిరిపుట్టేవరకు యిచ్చి తరువాత గంట కొకసారి ఇటుల తొమ్మిది మోతాదులకంటె ఎక్కువ యీయరాదు. తేలిక ఆహారము యీయవలెను. మత్తు పదార్థము లివ్వనికిరాదు.

7. యోగతరంగిణీ గ్రంథమున, నెయ్యి, తేనె, వెన్న, పిప్పళ్లు, అల్లము, మిరియాలు, సైంధవలవణములను మంచి నీళ్లతో నూరి త్రాగించిన కాలసర్పవిషము సైతము శమించును, అనివున్నది.

8. కుంకుడుపేరును నూరి కుంకుడుగింజంత సేవించిన విషము గక్కును.

9. కామంచి ఆకుపసరు 8 తులములు యివ్వవలెను. అన్నిజాతులకు చక్కా.

10. ముషిణివేరు రసం ఆకులు నూరి యివ్వవలెను.

11. బావంచాలు గోమూత్రాన నానవేసి ఎండించి గోమూత్రముతో నూరి యివ్వవలెను.

12. దుప్పితోలు కాల్చినమసిని కలిలో కలిపి యిచ్చిన పోడపాము కాటునకు విరుగుడు.

13. పురుగుడువేరు చెక్కను కలితోనూరి యివ్వవలెను.

14. ముషిణీ వేరు గంధం నూరి సీటితో లోనికిచ్చేది.

15. కానుగవేరు గంధం, తిప్పతీగెవేప గంధం నూరి నీళ్ళతో లోనికి పొడుపోడకు యివ్వవలెను.

16. తిప్పతీగెవేరు, యర్ర కలువదుంప, మిరియాలు, దీసిన ఆకు పసరుతో నూరి రక్తపోడకు యివ్వవలెను.

17. నల్లబలునువేరు గంధం రోజు 1కి 2 తులముల చొప్పున కొద్దిరోజులు యిచ్చాపథ్యంతోతినిన, రక్తకాళి పెంజరము అనుపాము కరిస్తే రోమకూపముల వెంబడి రక్తము వచ్చును అదికుదురును.

18. ఉసిరికపప్పు వేపాకు సమంచూర్ణం చేసి రెండు పూటలలో అరతులము చొప్పున సేవించితే పాము కరచితే వంటిని దద్దురు, తీటపుట్టిన, తగ్గును.

19. రెండుమూడు జిల్లేడు ఆకులను నమిలి మింగించి, జిల్లేడు వేరును నీళ్లతో అరగతీసి కుట్టినచోట వేసి వేరు గంధమును లోనికిచ్చిన పాముకాటు విషము హరించును. రెండు మూడురోజులైన తరువాత విరేచనమునకు ఆముదము యియ్యవలెను.

# పార్శ్వపునొప్పి

## (తలనొప్పి)

1. కొంచెము నల్లమందును శొంఠిగంధములో కలిపి పట్టించి కొంచెము నిప్పసెగ చూపించవలెను.

2. ఏవైపున నొప్పిగలదో ఆవైపు ముక్కు రంధ్రములో ఇంగువనీళ్లు పోయవలెను.

3. వెల్లుల్లిపాయ నూరి పట్టువేయవలెను.

# పిచ్చి

1. మగవానికి పిచ్చి ఎత్తిన ఆడదాని మూత్రము, ఆడదానికి పిచ్చి ఎత్తిన మగవానిమూత్రమును తాగించవలెను.

2. ఉన్మాద పిచ్చికి తాటిమట్ట రసములో తేనె కలిపి ఇవ్వవలయును.

3. ఇంగువ, కటుకరోహిణి, కానుగ విత్తులు, తెల్ల ఆవాలు, దిరిసినవిత్తులు, పిప్పలి, మిరియాలు, వస, శొంఠి, సైంధవలవణము; సమభాగములు, గోమూత్రముపోసి నూరి రసము తీసి పరిశుభ్రమగు గుడ్డనుముంచి కనులలోపిండిన చాతుర్థికజ్వరములు, సమస్త ఉన్మాదములు నివర్తియగును.

4. మూడుదినములు గుమ్మడివిత్తుల కల్కము వందు తేనెకలిపి పుచ్చుకొనవలయును.

5. గోవృపిత్తము, తేనె, పిప్పళ్ళు, మిరియాలు, సైంధవలవణము, వీటెనికాటుకచేసి నేత్రములకు పెట్టవలెను. భూతదోషమువలన కలిగెడి ఉన్మాదము సమస్తమగునవి నశించును.

6. ప్రథమదశయందు కుప్పింటచెట్టు సమూలము నీళ్ళు తలపకుండా తీసిన రసము ఒక ఔన్సు జాగ్రత్తచేసి అందులో ఆరు గోధుమగింజలయెత్తు ఉప్పు కలిపి మూడురోజులు ఉదయమున రోగి రెండు ముక్కురంధ్రములలోను పోసి తక్షణము ఒకటిగాని రెండుగాని బిందెల చన్నీటిని ధారలుగా పడేట్లు నెత్తిపై పోయవలెను. రోజుకు ఒక్కసారే చేయవలయును. ఎక్కువరోజులు కూడదు.

7. మూర్కొండాకు, వెల్లుల్లిపాయలు, కుంకుమపువ్వులను నిమ్మకాయ రసాననూరి, మూర్కొండాకు పసరున నాలుగురోజుల కొకసారి నస్యం చేయించేది. 3 రోజుల కొకసారి ఆవునెయ్యితో తల అంటేది.

## పిల్లల మూత్రం అడ్డు

1. సైంధవలవణం నూరి వంటికి రాచి, తంగేడుపువ్వు నూరి చనుబాలలో కలిపి లోపలికి పోసేది.

## పిల్లలు చన్నులు కుడుచుట

1. ఇప్పిమధుకమును చనుబాలతో నూరి స్తనములకు రాచేది.

## పీనస

1. పెరుగులో మిరియాలపొడి, బెల్లమును కలిపి ఎల్లప్పుడు సేవించుచుండిన సర్వ పీనసలు హరించును.

2. గోధుమపిండిని నేతిలో కలిపి భుజించిన పీనస హరించును.

3. జీలకర్రను చూర్ణించి చక్కెరతో కలిపి పుచ్చుకొని వను రాత్రి శయనించు కాలమున సగముగ కాచిన నీటిని దాహమును ప్రతిదినము పుచ్చుకొనినను పీనస హరించును. (ధన్వంతరి).

## ప్లీహము

1. పది గోధుమగింజల ఎత్తు పొంగించిన వెలిగారము, నాలుగు గోధుమ గింజల ఎత్తు కొట్టువసుపు, కలబంద పలు కులు రెండంగుళముల చతురములు కలవి కలపి, కొన్ని రోజులు ప్రాతఃకాలమున పరగడపున పుచ్చుకొనిన, విరేచనబద్ధ ముగల ప్లీహరోగము నివర్తించును.

2. నిమ్మపండ్ల రసముతో ఎండు పుగాకుల చూర్ణ మును కలిపి పట్టు వేయవలయును.

## పెట్టుమందు

1. ప్రతిరోజు ఉదయం పెరుగు అన్నము పెట్టేది.

2. ములగవేరు చెక్కరసం 4 తు, దిగువాయి నూనె 4 తు, కలిపి యిచ్చేది. మరునాడు ఉదయం పచ్చి పులుసు త్రాగించే ఉలవకట్టు అన్నం పెట్టేది.

3. ఉత్తరేణి ఆకురసం నిమ్మరసం కలిపి యిచ్చిన యెడల పెట్టుమందు పూడి వచును.

4. దుష్టువేరు సమూలం తెచ్చి ఎండబెట్టి ఆచూర్ణ మున మిరియాల పొడుముకు, పంచదార కలిపి పూటకు 1/4 తు॥ చొ॥ మూడురోజు లిచ్చేది. పులుసును, చల్ల వర్జితం.

5. మల్లెచెట్టు వేళ్లు, పులిశడుగుకో నూరి దానితో ఉడికించి వెన్నతో యిచ్చేది.

## పెట్టుమందు పరీక్షలు

1. దొండాకు పసరుగాని, పైడివత్తి రసమునుగాని చేతులోపోస్తే విరుగును.

2. మంచి గంధము తీసి పొట్టపై పట్టువేస్తే మందున్న చోట చెమర్చును.

3. పాలు కాచి పాళంగా చల్లార్చి, పెట్టు మందున్న దని అనుమానింప బడినవాని చేతులు ముంచితే తోడు కొనును.

4. రాతి సున్నమును అర చేతులలో రాచి ఆరనిచ్చి నలిపి వేస్తే నలుపెక్కును.

5. నల్ల జీడిగింజల రసమును దానిమీద గీతలు గీత ...గా గీయవలెను.

## పుండ్లు (వ్రణములు, గజ్జి చూడుము)

1. గోరింటాకు నూరి కట్టవలెను.

2. తమలపాకులు, వెల్లుల్లిపాయ, కప్పింట ఆకు నూరి కట్టవలెను.

3. కాలిన పుండ్లకు నరమూత్రముతో గుడ్డ తడిపి వేయువలెను.

4. సీలిమందును నూనెలో కలిపి పూయువలయును.

5. ఏ జంతువు కాటువలన కలిగిన పుండుకైనను దొండాకు నూరి పైనవేసి కట్టవలయును.

6. నోటిలో పుండ్లు ఉండిన యెడల తాటి, యీత, కొబ్బరి పువ్వుల రసము కొద్దిగ నీరుపోసి పుక్కిలించ వలెను.

## పుప్పి పన్ను

1. రెండు పాళ్ళు ఇంగువను, ఒక పాలు నల్లమందును నూరి పుప్పి పంటిలో పెట్టవలెను.

2. వాకుడు గింజల పొగ పట్టవలెను.

3. పుప్పి పంటి నొప్పికిన్ని, పన్ను నొప్పికిని పంటి రంధ్రము లో హారతి కర్పూరము పెట్టిన నొప్పి తీయును.

4. నల్ల ఉమ్మెత్త విత్తులను నూరి పుప్పి పంటిలో పెట్టిన నొప్పి మానును.

5. ఉత్తరేణి సమూలాల రసములో దూది తడిపి పుప్పి పంటిలో పెట్టిన నొప్పి మానును.

6. పుగాకు మెత్తగా నూరి పంటి బెజ్జములో పెట్టవలయును.

7. ములగ వేరు నూరి పుప్పి పంటి రంధ్రము లో పెట్టిన తగ్గును.

## పులి తేనుపు (అజీర్ణము చూడుము)

1. ముదురు అరటి కాయ పచ్చడి ముక్కలు కొరిగి ఎండబెట్టి పిండిచేసి బిళ్ళలు చేసి పుంచుకొని ఉప్పుతో తిన వలెను.

2. నీటిని త్రాగ వలెను.

3. పచ్చి కొబ్బరికాయ డొక్క రసము త్రాగవలెను.

4. అరటికాయల రసము లోపలి కియ్యవలెను.

## పురిపిటికాయ

1. మర్రి వూడలు కాల్చిన మసి, కొత్త సున్నం నూరి రాయవలెను.

2. పులి పుంచలి ఆకు రసము పూయు వలయును.

3. కంటి రెప్పల మీద పులిపిటి కాయలకు మామిడాకుల మధ్యనుండు ఈనెను కాల్చిన మసిని నీళ్ళతో కలిపి అంటించ వలయును.

4. జీడి మామిడి గింజలలోని చమురు తీసి పూయ వలెను.

5. రావిచెక్క బూడిద, కొత్త సున్నము, వీటికి సమముగా వెన్న కలిపి లేపనము జేయవలయును.

## ప్రసవము

1. జీలకఱ్ఱ నూరి లోపలికిచ్చిన గాని, మర్మ స్థానమున పూసిన గాని సుఖ ప్రసవ మగును. అడ్డముగా పడిన శిశువు అయినా బయలు పడును.

2. వెల్లుల్లి, శొంఠి నూరి నీళ్ళలో కలిపి లోపలికి ఇస్తే కడుపులో చచ్చిన పిండం సైతము పడిపోవును.

3. ప్రత్తిఆకు రసము పాలలో కలిపి యిస్తే సుఖ ప్రసవ మగును.

4. తమలపాకుతో ఏడు మిరియాలను నూరి లోపలికిస్తే సుఖముగా నీళ్ళాడును.

5. ముద్రబెండ వేరు తీసుకు వచ్చి ఆ స్త్రీ తలా ముడిలో ఉంచిన యెడల సుఖ ప్రసవ మగును. ప్రసవమయిన తరువాత తలలో ఉంచకూడదు.

## పెట్టు మందు

1. రేలయిగుజ్జు పచ్చడిగాని, నేపాళ మాత్రిగాని వేసి విరేచనము చేయించ వలెను.

2. బూడిద గుమ్మడికాయ కూర భోజనమున పెట్టు-చుండ వలెను.

3. తలమీద ప్రతి రోజు స్నానమున కుంకుడుకాయలు కొట్టి బూడిద గుమ్మడికాయ రసములో నానవేసి తల:టు-కొనుచుండవలెను.

## పేలడము

1. బండి గురివింద గింజల గంధము నీళ్ళతో తీసి పూయవలయును.

2. మంచి గంధము పూయు చుండవలెను.

3. మంచినూనె రాచి వేన్నీళ్ళతో స్నానము చేసిన పోవును.

4. ఒక చుక్క యూక్లిప్టస్ ఆయిలును కొంచెము-కొబ్బరినూనెలో కలిపి రాయవలెను.

## పేను కొరుకు

1. మందార పువ్వును నలిపి దినమునకు రెండు-

మూడు సార్లు గట్టిగా రాయవలెను. వెంట్రుకలు కూడా మొలుచును.

2. బొప్పాయి పువ్వును నలిపి రాయవలెను.

3. నల్లని చంపి నెత్తురు రాయవలయును.

4. గురువింద వేరు, గురువింద గింజలు, ములగ వండు, తేన కలిపి రాయవలెను.

5. చేదు పొట్ల ఆకురసము మర్దన చేయవలెను.

6. హంస పాదాకును నలిపి ఆ తావున రాచిన వెంట్రుకలు మొలచును.

## పేలు

1. వెల్లుల్లి రసము ఉదయపు పూట తలకు పూసి వక గంట సేపుంచి తరువాత సీకాయ పులుసుతో తలంటు కొనవలెను.

2. గంజాయి ఆకు రసము తీసి తలకు రాచిన పేలు చచ్చుటే గాక చుండ్రు కూడా పోవును.

3. శీతాఫలపు విత్తులను గాని ఆకులను గాని నీళ్ళలో మెత్తగ నూరి తలకు పూయ వలయును.

4. వేపాకు రసమును తలకు పట్టించవలెను.

## పైత్యము

1. జీలకర్ర కషాయముగాని, రసముగాని లేక పట్టిది గాని పూచుకొనవలెను.

2. మువ్వయి తులముల పాలలో వక తులము ఇప్ప మధుకము వేసి కాచి చల్లార్చి అందు తే న వ క తు ల ము

రెండు తులములు పంచదార వేసి కలిపి వుదయమున పుచ్చు కొనవలెను.

3. ఆరున్నొక్కసారి నిమ్మపండ్ల పులుసు వేసి జీలకఱ్ఱను ఎండలో బెట్టి ఆరవిచ్చుచు తలతిప్పు మొదలగు దారుణ రోగముల యందు సహితము పావలాయెత్తు చొప్పున ప్రాతః కాలపు పూట చప్పరించి బాగుగా నమిలి కొంచెము నీటితో మింగవలెను.

4. రాత్రిపూట మట్టి పాత్రలోగాని కంచు పాత్రలో గాని నీళ్ళుపోసి ఆరుబయట పెట్టి సూర్యోదయాత్పూర్వము మూడు పుడిశెల నీటిని పుచ్చుకొన వలయును. తేనె కూడ కలపవలెను.

5. కొబ్బరికాయ నీళ్ళు పరగడుపున పుచ్చుకొన వలయును.

6. పటిక బెల్లము పెరుగు మీగడ మీగడ సమభాగ ములు కలిపి ఉదయము పూటల తినవలయును.

7. నిమ్మకాయ రసములో కొద్దిగ యాలకి పొడి వేసి పంచదార కలిపి పులి చల్లలో దీనిని కలిపి యివ్వవలెను. కొద్దిపాటి ఉప్పు కూడా కలుప వచ్చును.

8. పటిక బెల్లము. యాలకుల పొడి కలిపి కొబ్బరి కాయ నీళ్ళలో వేసి పుచ్చుకొనవలెను.

... నిమ్మరసము, పటిక బెల్లము, సమభాగ ... వలయును.

... ధనియాల కషా ... వలయును.

11. పొట్టు తీసిన అల్లము 100 తు॥ ఆవు నెయ్యి 40 తు॥, వటిక బెల్లం 70 తు॥, అతిమధుర, మిరియాలు, ధనియాలు, లవంగాలు, యాలక్కాయలు, మంచి గంధం పుసిరికాయ వప్పు వక్కొక్కటి 1 తు॥ చొప్పున చూర్ణమును కలిపి దించి పూటకు ½ మొదలు 1 తు॥ వరకు పుచ్చుకొనుచుండిన సమస్త పైత్యములు నశించి మంచి సత్తువ గల్గును.

12. శీత వేప ఆకులు ప్రతి ఉదయం తినుచుండిన పైత్యము నశించును.

13. ఆవు చల్ల 3 తులములు, అల్లపు రసం ½ తులము తేనె రసం 2 తులములు, తేనె 1/4 తులము, జీలకర్ర రసం 1/4 తులము, నిమ్మ రసం అర తులము కలిపి ప్రతి దినం ఇచ్చిన సమస్త పైత్యములు నశించును.

## పేలు, ఈపి లేక యీళ్ళు

1. గంధకమును, గోమూత్రమున కలిపి మర్దన చేయవలెను.

2. వాయు విడంగములను ఆవనూనెతో మర్దించి ఆ తావుల మర్దన చేయవలెను.

## పొక్కులు

1. రసకర్పూరము మంచిగంధములో ...
చుండిన అన్నిరకముల పొక...

2. ఉసిరికవం...

3. ఉ...

4. మంచినూనెలో హారతి కర్పూరము వేసి రాయ వలయును.

5. వేపనూనెగాని, కానుగనూనెగాని రాచి మర్దన చేయువలయును.

6. నేతిలో పాలసుగంధి వేరును వేయించి, చూర్ణించి దానిని తేనెతో పిల్లలకిచ్చిన నోటియందు లేచు పొక్కులు మారించును.

## బడలిక

1. తలంటుకొనిగాని, లేకగాని వేన్నీళ్ళ స్నానము చేయువలయును.

2. నిద్రపోవలయును.

3. సంగీతము వినవలయును.

4. సంభోగానంతరము ఒక తులము బెల్లమును తిన లెను.

## బలవర్ధకౌషధములు

(అనగా బలమును కలుగచేయునవి)

1. వారము రోజులు ఉదయపు పూట ఒక తులము నె, ఒక తులము నీరుల్లిపాయ రసము కలిపి, పొంగించి చ్చుకొనవలెను. మంచి బలము, వీర్యవృద్ధి చేయును.

2. భోజనములో దేనితోనైనను కలిపి నిమ్మకాయ లుమవాడుచుండిన ఆయుర్వృద్ధి శరీరవర్చస్సు కలుగజేయును.

3. నేలగుమ్మిడి చూర్ణము చేసి, మూడు మొదలు ఆరు న్నముల ఎత్తువరకు ప్రతిరోజు ఉదయ ... ఆవు వెన్నతో గాని, పటిక పంచదారతోగాని పుచ్చుకొ

4. నలభయి రోజులు నేలతంగేడు సమూలమును ఎండించిన చూర్ణమును ప్రతిరోజు ఉదయమున తేనెతో పుచ్చుకొనవలయును.

5. పచ్చిమినపప్పు నానవేసి పొట్టుతీసి ఎండబెట్టి పిండి చేయవలయును. దానిని లేత కొబ్బరికాయ నీళ్ళలో తడిపి ఎండించి తిరిగి నీళ్ళతో తడుపుచు ఎండించుచు అటుల ఆమన్నొక్కసారి భావనచేసి, దానిని పాలు, పంచదార కలిపి వండి తినుచుండిన మంచి బలమును కలుగచేయుటయేగాక ధాతుపుష్టికూడా చేయును.

6. జీలకఱ్ఱ, పాలసుగంధి కషాయము కాచి కొంచెము పటిక పంచదార కలిపి పుచ్చుకొనుచుండిన మంచి రక్తము పట్టును.

7. పెద్ద వల్లేరుకాయలను యిండ్లు తీసి, ఆవుపాలలో వేసి, వండి ఎండబెట్టుచు యిటుల మూడుసార్లయిన తర వాత చూర్ణముచేసి, ప్రతిరోజూ రెండు పూటలను, చూ మునకు సమభాగము పంచదార కలిపి ఆ పంచదా కలిపిన చూర్ణము బేడ ఎత్తు మొదలు పావలా ఎత్తు వర పుచ్చుకొనవలెను.

8. ఇరవయి తులముల సీమబాదముపప్పు నానవే పొట్టుతీసి మెత్తగా నూరి ఒకచోట ఉంచి, రెండు తులము ఆవునెయ్యి, నాలుగు తులములు పటికబెల్లము కలిపి సన్న మంటబెట్టి పాకముచేసి, ఆ పై నూరినపిండి వేసి వండి పూట ఒకటి, రెండు ముల చొప్పున రోజుకు రెండుపూట పుచ్చుకొనవ

9. గుమ్మపాలలో శొంఠము మిరియపు పొడి వేసి పుచ్చుకొనవలెను.

10. దేహపరిశ్రమను చేయుచుండవలెను. మంచిగాలిని పీల్చుచుండవలెను. పరిశుభ్రత, మంచి ఆరోగ్య పద్ధతులను గమనించవలెను. జీవసాధన వ్యాయామము చేయుట మంచిది.

## బల్లి విషము

1. బల్లి పడి చచ్చిన వస్తువులను తినినపుడు కొద్ది శొంఠి, పిప్పలి, మిరియాలు, సైంధవ లవణము, పసుపు కలిపి పేడినీళ్ళలో వేసి, రెండు, మూడు రోజులు పుచ్చుకొనవలెను.

2 బల్లి కరచినచో కానుగ గింజలు నీటితో అరగదీసి పై రాయవలెను. (ఇచ్ఛావత్యము)

## బాలపాప చిహ్నలు

1. మైలతుత్తము రెండు గురిగింజలెత్తు, మూడు పలముల మంచి నీటిలో వేసి ఇవ్వవలయును. వమనము యి తగ్గిపోవును.

2. నవాసాగరము సున్నము కలిపి ముక్కువద్ద సన చూపించ వలెను.

3. రస భస్మమును రోగ బలిమిని బట్టి అర తులము రి ఆముదములో గాని చిట్టాముదములో గాని యిచ్చుట కలన విరేచనములయి నివర్తించును. ఇది చాలా మంచిది.

4. నీరుల్లిపాయలు నమిలి ఆ ఘాటును చెవులలోను ముక్కులలోను వూదవలెను.

5. తేరును పైకి ఎగరవేసి పట్టుకొనుచుండవలెను.

6. చేతుల మణికట్లపైన, మెడ వెనక ఊరు మధ్య వరము పైన, పసుపు కొమ్ము కాల్చి దానితో గాని, గుడ్డ చుట్ట చుట్టి దానితో గాని, పొగచుట్ట ఒకంతోగాని వచ్చే వరకు కాల్చవలెను. తరువాత రస భస్మమును చిట్రాముడ ములో కలిపి పై చెప్పిన రీతిని యివ్వవలయును.

7. పుగాకు నమిలి కండ్లలో కొద్దిగ పుమ్మి వేయ వలెను.

8. మారేడు కాయ ఆకు పసరు కండ్లలో పిండవలెను.

9. తేనె వరహా ఎత్తు, ఆకు జెముడు ఆకులు వెచ్చ చేసి తీసిన రసము వరహా ఎత్తు కలిపి యివ్వవలయును.

## బుడ్డ

1. తులము ఆముదమును, ఏభై తులముల పాలలో కలిపి ప్రతి దినము ఉదయమున పుచ్చుకొనవలెను.

2. సైంధవలవణము, పిప్పళ్లు, కరక్కాయ పెచ్చు, సమ భాగములు చూర్ణముచేసి ఆముదములో కలిపి యివ్వవలెను.

3. కరక్కాయలను గోమూత్రములో నానవేసి తరు వాత ఆముదలో వేయించి, చూర్ణముచేసి సైంధవ లవణము కొద్దిగ వేసి కొంచెము వేడినీళ్ళతో ప్రతిరోజు ఉదయమున పుచ్చుకొనవలయును.

4. కేల చిగురు నేతితో వండి కోసులను మోతాదు తినేది.

5. మునగ ఆకు తెచ్చి ఆముదతో వెచ్చచేసి కట్ట వలయును.

6. వచ్చిపోగాను తొక్క కాచి కట్టినయెడల బుడ్డ అంగము వావులకు మంచిది.

## బొటిమలు లేక మొటిమలు (ముఖమునిండ)

1. సీమబాదం పప్పు పాలుతీసి పైన పూయవలయును.
2. చనుబాలు, మంచిగంధముకలిపి రాయుచుండవలెను.
3. తాటి ముంజెల నీళ్లు రాయవలయును.
4. మిరియాలు, పాలతో గోరోజనము నూరి రాయవలయును.
5. మంచిగంధములో హారతి కర్పూరము కలిపి రాయవలయును.
6. మారేడుకాయల చూర్ణమును నీటిలో కలిపి ప్రతి రోజు రాయుచుండవలెను.

## బొల్లి (తెల్ల మచ్చలు మరియు పొడలు)

1. మిరియము, నల్ల కరక్కాయ, కృష్ణతులసి ఆకు రసమున గంధముతీసి రాయుచుండవలెను. కొన్ని మాసములు రాయవలెను.
2. నిమ్మ రసమున కరక్కాయలు కొద్దిగ చిత్రమూలము నూరి జాగ్రత్తచేసి వుంచుకొని రాయుచుండవలెను.
3. గజ్జేరాకు రసము, దిరిశనాకు రసము సమభాగములు కలిపి చాల రోజులవరకు రాయుచుండవలెను. నలభైరోజులకు తక్కువకాకుండా విడవక రాయవలెను.
4. నేల తంగేడు సమూలము చూర్ణించి, పెరుగుతో ప్రతి దినము ఉదయమున 2 మాసములు పుచ్చుకొనవలెను.

# బోద

1. కరక్కాయ బెరళ్ళను వేయించి ఆ పొడుమును వరుండబోవునపుడు తేనెతో ప్రతిరోజు ఏడెనిమిది గోధుమ గింజలెత్తు పుచ్చుకొనవలెను.

2. ఆవ నూనెనుగాని, నువ్వుల నూనెలో వెల్లుల్లి పాయలు వేసి కాచిగాని ఆ తావుల రాయుచుండవలెను.

3. కొతిమీరి, కరివేప, తంగేడుపువ్వు, ములగలను ఆహార పదార్థములలో వాడనగును.

# భగంధరము

1. జిల్లేడు ఆకులు, పసుపు, సైంధవ లవణము, గుగ్గిలము, గన్నేరాకులను మెత్తగానూరి నూనెలో వేసి, తైలముగ కాచి లేపనముచేసిన భగంధరము శమించును.

2. మల్లెయాకులు, మఱ్ఱిచిగురు, తిప్పతీగ, శొంఠి, సైంధవలవణము వీనినన్నిటిని మజ్జిగతో నూరి, లేపనముచేసిన భగంధరము శమించును.

3. వాయు విడంగములు, త్రిఫలములు. పిప్పళ్లు వీనిని సమభాగములుగ చూర్ణించి తేనె, నూనె కలిపి, లేపనము చేసిన క్రిములతో గూడియుండు భగంధరములు నివారించునని చరకమునందు వ్రాయబడియెను.

4. మనుష్యుని శల్యములనుండి తీసిన తైలమును పైన పూసిన భగేంద్రము ఎండిపోవునని "రసరత్నాకరమున" వ్రాయబడెను.

5. వాయువిడంగములు త్రిఫలములు, పిప్పళ్లు సమ

భాగములు చూర్ణించి తేనె, నూనె కలిపి లేపనము జేసిన క్రిములతో గూడిన భగంధరము శమించును.

## భగ లేపనము

1. తేనెలో పచ్చకర్పూరమును కలిపి మామిడి వేరుతో అరగతీసి, భగమునకు లేపనమొనరించిన అది కఠినముగ నుండును.

2. కరక్కాయ, పోక, జాజికాయ కలిపి చూర్ణించి యోనియందుంచిన యోని గాఢీకరమగును.

## భయము

1. నీటితో లవంగమును నూరి కంటికి కొద్దిగా పెట్టవలెను.

2. నిమ్మరసమును నీటిలో కలిపి త్రాగించవలెను.

## మచ్చలు

1. కాళ్ళమీదగాని, చేతులమీదగాని మచ్చలు కనపడిన యెడల కానుగవేరు, మిరియాలు నూరి రాచిన యెడల పోవును.

2. సున్నము, అందుకు నాలుగు వంతులెక్కువ ఉత్తరేణి సమూల భస్మము ఆముదములో వేసి కలిపి రాచిన యెడల అరిచేతులలోని మచ్చలు పోవును.

## మడమలు పగులుట మరియు శూల

1. కొబ్బరినూనెలో మైనము వేసి కాచి రాయుచుండిన యెడల మడమ పగుళ్ళు పోవును.

2. రాతిమీద ఇసుక వేసి నీళ్ళలో ప్రతి దినము మడమలు రాయుచుండిన పగలవు.

3. గేదె పేడ ఉడికించి కట్టినయెడల మడమశూలల నివర్తించును.

4. మడమశూలలకు సున్నం, చవుడు, నవాసాగరము నూరి కట్టవలయును. మంట ఉన్నట్టయితే చన్నీళ్లు ధారగా పోయవలెను.

## మశూచికము

1. కొద్దిపాటి విరేచనమగునటుల ఆముదము ఇవ్వవచ్చును.

2. వేపాకు మెత్తగానూరి శరీరమంతటను పూయవలయును.

3. వేపచెక్క, చంద్రచెక్క, దిరిశనచెక్క గంధంతీసి కలిపిపూయవలయును.

4. సాంబ్రాణిపాగ వేపమండలతో విసరుట తరచు చేయుచుండవలెను.

## మాదలు

1. తలమీద మాదలకు తమలపాకు నమిలి ఉమ్మి వేయుచుండవలయును.

2. రెండురోజులకొకసారి దిరశనాకు పసరు తలకురాచి గేదెపేడతో తల రుద్దవలయును.

3. కోడిగుడ్లసొన రావిచెక్క కాల్చిన మసి కలిపి రాయవలయును.

4. మిరియాలు, తంగేడు చిగుళ్లు నూరి రాయు వల
...మును.

5. తీవ్రమగు మాదలకు నల్లజీడిగింజలు, ...వ్వలు కలిపి
...ండుజిల్లేడు రసాన నూరి రాస్తే నయమగును. వక్కసారి
...సి వారము రోజులు చూచి తిరిగి రాయువలెను.

6. బెల్లము, నల్లమందు నూరి మాదలపై రాచిన
...హరించును.

## ముట్లు ఆగుటకు

1. పాలు, పంచదార, కవిరి, నెయ్యి తేనె, కలిపి
10 రో॥ రెండు పూటలా యిచ్చేది.

2. తెల్ల జిల్లేడుపువ్వు, బెల్లము నూరి యిచ్చేది.

## ముట్టుకడుపునొప్పి

1. నొప్పివచ్చినపుడు పెద్దకాకరాకు పరసులో పాత
బెల్లము వేసి పుచ్చుకొనవలెను. చప్పిడి పథ్యము.

2 ఇంగువను పూటకు 5 చిన్నముల చొప్పున ఆవు
వెన్నతో యియ్యవలెను.

3. కాకరాకువసరు 2తు, నెయ్యి 2తు, మిరియాల
చూర్ణము ½తు. నూరి యియ్యవలెను.

## ముక్కు

1. నూనెలో సంపెంగపువ్వులు ఆరోజులి నూరి
ముక్కులో పిండిన సమస్తమగు రోగములు పోవును.

2. ముక్కువెంట నీరు కారుచున్న యెడల నీరుల్లిపాయ రసము పిండించు కొనవలయును.

3. చేదు పొరకాయ రసమును ముక్కులో పిండిన ముక్కులో దుర్గంధము (మురిగి పీనస) పోవును.

## ముక్కువెంట నెత్తురు

1. దానిమ్మ లేత ఆకులయొక్కగాని, పువ్వులయొక్క గాని, రసము మూడు నాలుగు చుక్కలు ముక్కులో పోయ వలయును. పచ్చకర్పూరమును కలుపవచ్చును.

2. పరిశుభ్రమగు తెల్లటి గుడ్డమీద సున్నము రాచి దానిమీద కోడిగ్రుడ్డులోని తెల్లటిసొన వ్రాసి చుట్టగా చుట్టి ముక్కులో నుంచవలెను.

3. లేత మేడి ఆకులను ఎండబెట్టి చూర్ణము చేసి తేనెతో పుచ్చుకొను చుండవలెను.

4. పటిక పొడుమును పీల్చవలెను.

5. అప్పుడప్పుడు కొద్దిగ ఎండు శెనగలు నమలు చుండవలెను

6. నీరుల్లిపాయను చితుకకొట్టి వాసన చూపించ వలెను.

7. దానిమ్మ పువ్వుల రసమునుగాని, దానిమ్మ ఆకుల రసమునుగాని, నాలుగుచుక్కలు నాసికా రంధ్రమున పిండిన నెత్తురు కారుట తగ్గిపోవును.

# మూత్రబంధన

1. గంజిలో సూరేకారము వేసి అరగంట కొకసారి పుక్కిలించు చొప్పున యివ్వవలెను.

2. ఆవువెన్నలో పంచదార వేసి పుచ్చుకొనవలెను.

3. మజ్జిగలో యాలకులపొడి కలిపి ఇవ్వవలయును.

4. బెండవేరుగునీళ్లు వేడికషాయము కాచి అప్పుడప్పుడిచ్చుచుండవలెను.

5. మేకపాలు, తేనెకలిపి పుచ్చుకొనవలెను.

6. వట్టివేరు తెచ్చి నీళ్ళలో వేసి యిగరకాచి అందు తేనె కలిపి యివ్వవలెను.

7. ఉసిరికపప్పు కషాయము కాచి అందులో తేన పసుపు వేసి పుచ్చుకొన వలయును.

8. తెలగపిండి వేళ్ళరసములో తేనె కలిపి యిచ్చిన ఎటువంటి కఠినమునదయినను నివర్తించును.

9. సెగ రోగముచేత మూత్రము బంధింపబడినచో కొత్తమూత్రము ... 2½ తులములు పుచ్చుకొనిన మూత్రము వెడలును.

# మూర్ఛ (అపస్మారము)

1. మూర్ఛాండాకు పసరు గేదె వెన్నలో కలిపి లోపలికివ్వవలెను. ఇది చాలమంచిది.

2. దురదగొండ కొమ్మలు కట్టకట్టి నెమ్మదిగా నూగు అంటునటుల కొట్టవలెను.

3. ఎండు పసుపుకొమ్ము పొగపట్టవలెను.

వాతసంబంధమగు వాటికి అరతులము, నువ్వులు, లము వెల్లుల్లిపాయలు చూర్ణించి నీటితో నిత్యము తీసి కొనవలెను.

5. వస చూర్ణము తేనెతోగాని, ఆవుపాలతోగాని ఎని మిది మాసములు పుచ్చుకొనవలెను.

6. జిల్లేడు చిగుళ్ళరసం తీసి నస్యంగా వాడవలెను.

7. కసివింద వేళ్ళ రసమున నెయ్యి కలిపి యివ్వవలెను.

8. మగశిశువుగల స్త్రీ చనుబాలలో కుంకుడుకాయ అరగదీసి ముక్కులో వేయవలెను.

9. దుష్టపాకురసము చెవిలో పోయవలెను.

10. మనుష్యుని ఎముక భస్మము చేసి పీల్చి, ఆ భస్మముయొక్క పొగకూడా పట్టవలయును.

11. బహిష్టయిన స్త్రీ మూర్ఛరోగిని మూర్ఛలో నున్నప్పుడు ముట్టుకొనవలయును.

12. చనుబాలు, చెరకురసం, శ్రీగంధం కలిపి కొద్దిగా ముక్కులో పోయవలెను.

13. మందారచెట్టు చెక్క చూర్ణం పావుతులము వెన్న లో కలిపి యివ్వవలెను.

14. నిమ్మపండురసములో వకతులము వసచూర్ణము కలిపి ప్రతిరోజు యివ్వవలయును.

15. ఉత్తరేణి విత్తులను గోమూత్రముతో నశ్యము చేయవలెను.

16. జిల్లేడుపాలలో విభూతిని నాలుగు మారులు ఎం డించి రోగికి నశ్యం చేయవలెను.

17. కుంకుడుకాయ, వావిటాకు నూరి ఆరసమును చెవిలోను ముక్కులోను పోసి కొంచెము లోపలికిచ్చేది.

18. స్మశానములో నుండు మనిషి పుర్రెను చూర్ణము చేసి పథ్యముగ ప్రతి ప్రాతఃకాలమున పీల్పించేది.

19. మనిషి ఎముకచూర్ణమును ప్రతిరోజు ఉదయమున రెండు వడ్లగింజల ఎత్తు తేనెతో పుచ్చుకొనవలెను.

20. దురదగుండవేళ్ల రసమును కసివిందవేళ్ల కషాయములో నెయ్యి చేర్చి పుచ్చుకొనిన మూర్ఛలు తప్పక నివర్తించను.

## మూలశంఖ లేక మూలవ్యాధి

1. నీరుల్లిపాయరసము రెండు డబ్బులెత్తు పంచదార కూగాని ఎత్తు కలిపి ప్రాతఃకాలమున పుచ్చుకొనవలెను.

2. మూడు తులముల ఆవు నేతిలో అరతులము వెలిగారము కలిపి నూరి మొలకలకు రాయ వలయును.

3. పాము కూసము పొగ ఆసనమునకు కట్టవలెను.

4. రావాకు, వేపాకు నూరి లేపనము చేయ వలయును.

5. బొంత చెముడు పాలలోను, పసుపు యందును నూలు దారమును పలుమారు ఊరబెట్టి మొలకలకు కట్టిన తెగి పడును.

6. జిల్లేడు ఆకులకు ఆ ముదము పూసి వెచ్చచేసి ఆ స్థానమున కట్టవలయును.

7. మజ్జిగయాకుల బూడిద నూనెతో కలిపి లేపనము చేయవలయును.

8. శేన నల్లేరు రసము యివి రెండేసి తులములు కలి.
గ్రాగిన రక్తమూలశంఖ హరించును,

9 వస, గంజాయి పసువు సమభాగములు పొడుము-
చేసి పొగ వేయువలయును.

10. చక్కెర, లేత తామరఆకు నూరి తినవలెను.

11. కరక్కాయ, పిప్పళ్లు నేతిన వేయించి బెల్లము-
కలిపి తినవలెను.

12. ప్రతిరోజు ఉదయమున నీ మేకపాలను పుచ్చుకొను
చుండిన రక్తము కారునవి హరించును.

13. నాలుగు తులములు వేపాకు, నల్ల జీడిగింజలు-
అయిదు, నూరి బెల్లముతో పాకముబట్టి అయిదురోజులు ఇవ్వ
వలెను.

14. నూరు నిమ్మపండ్ల రసముతో పావు శేరు ఉత్తరేణి
గింజలను మర్దించి మాత్రలుచేసి ప్రతిరోజు వక్కొక్క మాత్ర-
వేసికొనిన రక్తమూలవ్యాధి హరించును.

15. కందగడ్డకు మన్ను పట్టించి పుటమువలె ఉడక
బెట్టి ఉప్పు నూనె కలిపి తినవలెను.

16. కరక్కాయలు, శొంఠి, పిప్పళ్లు దానిమ్మకాయల
బెరడు నీటిలో ఎవరిశరీరమున కనుకూలించిన, దానిని తెచ్చి
బెల్లము వేసి మెత్తగానూరి తినిన మూలవ్యాధి, దానియొక్క-
మలబద్ధముల జీర్ణము హరించును.

17. గోమూత్రమున కాకరకాయను రాత్రి నానవేసి
ఉదయమున తీసి బెల్లముకలిపి తినవలెను.

18. ముప్పది తులముల పాలలో అరతులము వెలి

గారము వేసి రోజుకు మూడుసార్లు పుచ్చుకొనవలెను. రక్తము తత్క్షణమే కట్టును.

19 నిమ్మరసమున కోడికాలు ఎముకగంధము తీసి పట్టించి చిక్కుడాకులు వేసి కట్టవలయును.

20. నల్లేరురసము తేనె రెండేసి తులములు కలిపి వరుండబోవునపుడు పుచ్చుకొనుచుండిన రక్తమొలలు తగ్గిపోవును.

21. ఉదయమునసే మేకపాలను త్రాగుచుండిన ఎడల నెత్తురుకారు మొలలు తగ్గిపోవును.

22. బొంతజెముడుపాలు పసుపుకలిపి పైన రాయుచుండిన మొలలు హరించును.

## మేహము

1. ఉత్తరేణిఆకు రసములో మిరియాలపొడిని కొద్దిగ కలిపి పుచ్చుకొనవలెను.

## రక్తవాంతి

1. పిరుగు తోటకూరను తరుచు వాడుచుండవలెను.

2. ముట్టివండ్లను ఎండించి చూర్ణముచేసి అదియును అతిమధుర చూర్ణము సమభాగములు కలిపి అందుకు సమము పంచదార కలిపి పుచ్చుకొనవలెను.

3. కొంచెము ఉప్పును చల్లని నీళ్ళలోకలిపి త్రాగిన వెంటనే కట్టును.

## రసపట్లు

1. నోరు పట్టినయెడల నీళ్ళలో పటికపొడివేసి తరుచు పుక్కిలించి కొంచెము సేపు నోట వుంచుకొని ఉమ్మి వేయుచుండవలయును.

2. తులసిఆకును కవిరితో నమలుచుండి ఉమ్మి వేయవలెను.

3 తాంబూలమును కవిరితో వేసుకొన వలెను.

4. నీళ్ళలో వెలిగారమువేసి ఆనీటిని తరుచు పుక్కిలించ వలెను.

## రాచపుండు

1. కరక్కాయ, కవిరి సమభాగములు చూర్ణముచేసి నేయికలిపి రాయవలయును.

2. రాక్షసిబొగ్గు చూర్ణం చల్లవలెను.

3. వేపాకునూరి కట్టుచు, వేపాకు కషాయముతో కడుగుచుండ వలెను.

4. జివ్విపాలు పోడుచుచుండవలెను.

5. అరిసెలువేసి కట్టవలెను.

## ఋతుశూల

1. ఉసిరికాయంత బెల్లములోనైనను, వెన్నలోనైనను చింతపండులోనైనను, ఇండుపకాయంత రాతిసున్నమువుంచి బయట ఉండిన నాలుగురోజులు ఉదయమున పుచ్చుకొన వలయును.

2. పూటకు అయిదు చిన్నముల ఇంగువ ఆవువెన్నలో కలిపి యివ్వవలయును.

3. తంగేడువేళ్లు మిరియాలు నీళ్లలోనూరి మాత్రలు చేసి రోజుకు రెండుపూటల వేసికొనవలెను.

4. మిరియాలు, ఏక వెల్లుల్లిపాయలు, మార్కాండాకు సమభాగములువేసి నూరి వెలువలనున్న మూడురోజులు యిచ్ఛాపత్యముతో యివ్వవలయును.

5. వెలువలనున్న రోజులలో రెండుపూటలు వేపాకు రసములో మిరియాలపొడి కలిపి యిచ్ఛాపత్యముతో సేవించవలెను.

6. చప్పిడిపత్యము పెట్టి బయట ఉన్న మూడురోజులు అటుల మూడుముట్లవరకు మార్కాండాకు పసరు మూడు బొట్లు మంచినూనె మూడుబొట్లు కలిపి యివ్వవలయును.

# రుతుబద్ధము

1. పావురము లరెట్టను బెల్లములో పొదిగి, బహిష్టు రోజులలో ఉదయముకూడ ఒక్కసారి చొప్పున మూడు రోజులు యివ్వవలయును.

2. పాలు, పంచదార, నెయ్యి కలిపిన తర్వాత కరి, కేనె కలిపి, పదిరోజులు రోజుకు రెండు పూటలు యివ్వవలయును.

3. తెల్లజిల్లేడుపువ్వు బెల్లము నూరి యివ్వవలయును.

4. ఒక చిన్నము ముసాంబ్రమును నీళ్ళతో నూరి, లోపలి కివ్వవలయును.

5. దాల్చిన చెక్కను అప్పుడప్పుడు వట్టిది తినుచు ద్రవమును మ్రింగుచుండవలెను.

6. జీలకర్ర దోరగ వేయించి తినుచుండవలెను.

# రేచీకటి

1. కానుగవేరు తేనెతో అరగతీసి కండ్లకు పూచవలెను.

2. నల్ల ఉమ్మెత్తాకు రసము, అల్లపు రసము కలిపి కండ్లకు పూచవలెను.

3. ములగాకు రసము, నల్లి నెత్తురు కలిపి కండ్లకు పెట్టవలయును.

4. జాజికాయను తేనెతో అరగదీసి, ఆ గంధమును కండ్లకు పూచవలెను.

5, తేనె, ములగాకు రసము కలిపి నేత్రములకు పెట్టవలయును.

6. ఒకటి రెండు చుక్కలు రాత్రిపూట నీరుల్లిపాయ రసమును కండ్లలో పిండవలెను.

7. మిగతా పదార్థములు వదలి వారమురోజులు దేశవాళీ గోంగూరను వండుకొని అన్నాధరవుగ చేసికొని తినవలెను.

8. కంటిలో ఆరోజు విడిన పరిశుభ్రమగు అవిశ పువ్వుల రసము పోయుచుండవలెను.

9. సబ్బు అరగదీసి వేయుచుండవలెను.

10. మేకచేమను నీళ్లలో వేయవలెను.

11. తమలపాకు రసమును పరుండబోవునపుడు కండ్లలో రెండు మూడు చుక్కలు వేయుచుండిన రేచీకటి పోవును. నేత్ర రోగములకు చాలవాటికి మంచిది. మేలు చేయును.

## వమనము (వాంతి చూడుము)

1. జ్వరములలో వమన మున్నయెడల రాతి సున్నము పైని తేటనీరు, పాలు, అయిదేసి తులములు కలిపి అప్పు డప్పుడు యీయవలయును. సాధారణ వమనములకు అయిదు తులములు రాతిసున్నము నీటిని, ముప్పది తులముల పాలలో కలిపి ప్రతిరోజు మూడుపూటల యివ్వవలయును.

2. ఏభయి తులముల నీటిలో మూడు తులముల శొం చూర్ణము వేసి రెండు ఘంటలసేపు మరగబెట్టి చల్లా ర్చిన తరువాత అరగంట కొకసారి కొద్ది కొద్దిగ యీయ వలయును.

3. మరగబెట్టిన ఏబది తులముల నీటిలో ఒక తులము లవంగ చూర్ణము కలిపి రోజుకు మూడు పూటలు, పూట కొక్కంటికి అయిదు తులముల చొప్పున యివ్వవలయును.

4. మంచుగడ్డ ముక్కలను కొద్దికొద్దిగా నోట ఉంచ వలెను.

## వరిబీజము

1. పాలు ఆముదము సమభాగములు కలిపి పూటకు రెండు తులములు చొప్పున పుచ్చుకొన వలయును.

2. నాచు నెచ్చచేసి కట్టవలెను.

3. ముప్పది తులముల నీటిలో నాలుగు తులముల ములగచెక్క వేసి కషాయముకాచి యెనిమిదవ వంతువరకు కాగిన తరువాత పావుతులము సైంధవ లవణమువేసి, పుచ్చు కొనవలయును.

4. బెండాకు, వ్రట్టమన్ను నూరి, వెచ్చచేసి కొంత సేపు కాచి, దానికి పైన వేసి కట్టవలెను,

5. రాసున్నము, కోడిగుడ్డు సొనతో నూరి, పట్టు వేయవలెను.

6. వస, ఆవాలు నూరి పట్టు వేయవలెను.

7. పుల్ల దబ్బఆకులు, ఆముదమున వెచ్చచేసి కట్ట వలెను.

8. చింతవండు, సున్నము కలిపి కట్టవలెను.

9. వంకాయ ఉడికించి వేడిగా నున్నప్పుడు కట్టవలెను.

10. అర తులము ఇంగువ, ఒక తులము వెల్లుల్లి, పాండు తులములు ఉలవలు, ముప్పది తులముల మంచి నీళ్ళలో కషాయము పెట్టి, యెనిమిదవ భాగము వరకు యిగురువరకు కాచి, అందులో అరతులము నెయ్యి కలిపి పుచ్చుకొనవలెను.

11. పది మిరియాలు, పది ములగ పువ్వులు కలియు నూరి, కొంచెము కడుగులో కలిపి పుచ్చుకొనవలెను.

12. పిప్పళ్ళు, మిరియాలు, శొంఠి ఒక్కొక్కటి తులము చొప్పున ముప్పయి తులముల నీళ్ళలో వేసి, యెనిమిదవ భాగమునకు యిగురు నటుల కషాయము కాచి, పుచ్చుకొనవలెను.

## వాతము

1. శొంఠి సారాయితో నూరి పట్టువేసిన మేహవాత నొప్పులు, పక్షవాతము నొప్పులు హరించును.

2. ఆముదముతో బుడ్డకాకరాకు రసము యెక్కువగ

వేసి, కాచి, లోపలికిచ్చినను పైనమర్దన చేసినను నడుము నొప్పి, మేహవాత నొప్పులు నివర్తించును.

3. నూనె నాలుగుతులములు, వయిడివత్తి ఆకురసము నాలుగు తులములు కలిపి, తులమగువరకు కాచి, తలకు మర్దన చేసినయెడల శిరోవాతము తగ్గును. వంకాయ కాయతో రుద్దకూడదు.

4. నల్లమందు కొద్దిపాటి మిరియాల రసముతో, శొంఠి రసముతో వేసుకొనుచుండిన సమస్త వాతములు పోవును.

## వాంతి (వమనము చూడుడు)

1. కరివేపాకు, జీలకర్ర, ఉప్పు, తేనె, నిమ్మకాయ రసము కలిపి యివ్వవలయును.

2. జీలకర్ర, మిరియాలు, సైంధవలవణము, పంచదార, తేనె యివి లేహ్యంచేసి పుచ్చుకొనవలెను.

3. ధనియాలు, జీలకర్ర, చూర్ణముచేసి ఆవునెయ్యి, పంచదార కలిపి పుచ్చుకొనవలెను.

4. వెలగపండుగుంజు, పిప్పలి చూర్ణము తేనెకలిపి యివ్వవలయును.

5. దాల్చినచెక్క, యాలకులు, మిరియాలు, చింతపండు యింగువ నూరి తేనెకలిపి యివ్వాయవలెను.

6. కరక్కాయ పొడుమును తేనెతోకలిపి పుచ్చుకొనవలెను.

7. మేడివేరు ఆవుపాలతో గంధము తీసి పంచదారకలిపి సేవించిన యెడల రక్తవాంతికూడా కట్టును. ఇచ్ఛాభవత్యం.

8. నీళ్లలో నిమ్మకాయ రసమును కలిపి యివ్వ వలయును.

9. కడుపుపైన ఆవాలపట్టు వేయవలయును.

## వాంతి అగుటకు

1. వేడినీళ్ళు ఎనిమిదితులములు తెచ్చి అందులో తులము ఉప్పు, తులము ఆవాలపిండి కలిపి యివ్వవలయును.

## విరేచన బద్ధము (విరేచనము లగుటకు)

1. ఆముదము ఒకతులము, ద్రాక్షపండ్లు రెండు తులములు మొత్తము యిరవయి తులములు కాచి వడియకట్టి ఉదయమున యిచ్చుచుండ వలెను.

2. తేనె రెండుతులములు, సునాముఖి నాలుగుతులములు, ద్రాక్షపండ్లు ఎనిమిది తులములు కలిపి నూరి రాత్రి పరుండబోవునపుడు వకతులము పుచ్చుకొనిన ఉదయమునకు విరేచన మగును.

3. మూడు నీరుల్లిపాయలు, గుప్పెడు చింతాకు నూరి యిచ్చిన విరేచన మగును.

4. ఆకుజెముడు చెట్టుపాలు ఒకటి రెండు చుక్కలూ పడు ఎనిమిది తులముల చల్లలో వేసి కాచి వడయకట్టి ఇచ్చిన విరేచనములగును.

5. తవ్వెడు మరుగునీళ్ళలో సుమారు నిమ్మకాయంత ఆవువెన్న వేసి త్రాగించిన మలమూత్ర బద్ధము మానును.

6. దాల్చినచక్క అరతులము, కరక్కాయ వేళ్లు

మూడుతులములు, వీథయితులముల నీటిలోవైచి కషాయము బెట్టి ఏడుతులములుగ మరగబెట్టి ఉదయముననే యివ్వ వలయును.

7. ఆముదపుపప్పును అరచుక్క మొదలు రెండుచుక్కల వరకు తులమెత్తు మొదలు రెండుతులములు ఎత్తు వెన్నతో గాని లేక నెయ్యితోగాని యిచ్చిన విరేచనము గును.

8. నేపాళపు గింజలలోని పప్పును గుడ్డలో మూట గట్టి పేడలో ఉడికించి, ఆగింజలలోని ఆకులను తీసివేసి, ఒక వంతు పప్పును, కవిరి రెండువంతులు చొప్పునచేసి నూరిన మంచి విరేచనౌషధ మగును. మోతాదు మూడు గోధుమ గింజలయెత్తు.

9. చిట్టాముదము, ఆవుపాలు సమభాగములు కలిపి, కొంచెము కలకండ కలిపి, పుచ్చుకొనినయెడల సౌఖ్యముగ విరేచనములు, కడుపులోని పురుగులు కూడా పడిపోవును. సాయంత్రము శొంఠి, మిరియాల కషాయము త్రాగవలెను.

10. ఆముదము, తేనె, అల్లపురసము, సమభాగములు కాచి పుచ్చుకొనవలెను.

11. అల్లపురసము, ఆముదము, పాలు కాచి పుచ్చుకొన వలయును. కొంచెము తేనె, ద్రాక్షపండ్లు కలిపి, పుచ్చుకొనవలయును.

12. పాలు, తేనె, ద్రాక్షపండ్లు కలిపి పుచ్చుకొన వలయును.

13. అవిశఆకు చారుకాచి త్రాగవలెను.

14. తెల్లవారుఝామున చల్లటినీటిని నాలుగైదు

కొన్నులు నీటిని లోనికి పుచ్చుకొనుచుండిన విరోచన బద్ధము మానును.

15. నేలతంగేడు చెట్టును పొడిచేసి, మూడు వేళ్ళకు వచ్చినంత బెల్లములో వేసి, పరుండబోవునపుడు తినిన ఉదయమునకు గ్రూడించి విరేచనమగును. శరీరమును మంచి స్థితిలోనికి దెచ్చును.

## విరోచనములు (అతిసారము)

1. మిరియాలు నూరి నీటిని గంటలో వేసి పొంగించుచు అందున మిరియాల మాత్రలు ఆ నీటియందు వేసిన కొంచెము సేపటికి తేలును. ఆ తేలిన మాత్రల వయికి తీసి కొంచెము నల్లమందు కలిపి నూరి కుంకుడు కాయంత మాత్రలు చేసి తరువాత పావుగంటకు వకటి చొప్పున తగ్గువరకు అయిదారు మాత్రలు వేసిన యెడల ఎటువంటివయినను తగ్గిపోవును.

2. దానిమ్మ మొగ్గల చూర్ణము పుచ్చుకొనవలయును.

3. శొంఠి మెత్తగా నీళ్ళలో నూరి కొంచెము నల్లమందు కలిపి ఉడికించి శనగ గింజలంత మాత్రలు చేసి పూటకొక మాత్ర చొప్పున మూడు సార్లుగాని యెక్కువగానున్న యెడల రెండేసి గంటల కొక మాత్రగాని వాడవలయును.

4 నేతిలో వేసి సోపు శొంఠి వేరువేరుగా వేయించి వేరువేరుగా చూర్ణము చేసి సమభాగములు కలిపి యుంచుకొని మూడు వేళ్ళకు వచ్చినంత చూర్ణము నోటిలో వేసి కొని కొద్దిగ నీళ్ళు పుచ్చుకొనవలయును.

5. శరీర స్థితిగతులను పరిశీలించి కొద్దిగ నల్లమందు వాడిన యెడల తగ్గును. పిల్లలకు నల్లమందు వాడకూడదు.

## వీర్యవృద్ధి (ఇంద్రియ నష్టము చూడుడు)

1. పాలు, మినుములు, జీడిపప్పు, ఉసిరికపప్పు సమ భాగములు నూరి యివ్వవలయును.

2. పంచదార తేనె, ఆవుపాలు, నువ్వులు, పల్లేరు కాయలు యివి సమ భాగములు గుండ చేసి పూటకు తులము చొప్పున సేవించ వలయును.

3. మెంతులు దోరగా వేయించి విసిరి పంచదారతో పాకం బట్టి ఉదయమున అరతులము చొప్పున సేవించవలెను.

4. కుండలో ఆవుపాలు పోసి పొయి సెగను బెట్టి ముదురు తుత్తిరి బెండ వచ్చివేరుతో కలయ త్రిప్పుచుండిన పాలు గట్టిపడి చూర్ణముగా తయారగును. దీనిని పూటకు బేడెత్తు ఆవుపాలలో వేసి ప్రతిరోజు ఉదయమున పుచ్చుకొన వలయును.

5. ఖర్జూరపు కాయలు కోసి గింజ తీసివేసి అందు నిండుగ పంచదార కూరి నలభయి కాయలను తేనెలో ఊర వేసి ప్రతిరోజు వక కాయ చొ॥ 40 రోజులు పుచ్చుకొన వలెను.

6. ఉసిరిక చూర్ణమును ఉసిరిక రసముతో ఏడుసార్లు ఊరబెట్టి నేతితో పుచ్చుకొని పాలను త్రాగిన యెడల మిక్కిలి వీర్యవృద్ధి గల్గును.

# వ్రణములు

1. కృష్ణతులసి ఆకు నూరి, కట్టిన వ్రణములలోని క్రిములు వశిపోవును.

2. అరటికాయను కుమ్ములో ఉడికించి, ఆముదమున నూరి ఐదు కట్లు కట్టవలెను.

3. అరటిపండు, వరి అన్నమును ఆవునేతితో నూరి కట్టవలెను

4. గుల్లసున్నం ఆముదములోనూరి దూదికిరాచి వత్తి ఎక్కించవలెను.

5. ఆవునేతితో రావిచిగుళ్ళను వుడికించి కురుపుమీాద వేసి ఆపైన వల్లమందు నీళ్ళనుపోసి ఆపైన మయినముబిళ్ళ వేయవలెను. పురుగులు చచ్చును.

6. రుద్రజగడ ఆకునూరి ఆవునేతిలొ వుడికించి కట్టవలెను.

7. నరమూత్రముతో వలగాకునూరి రావిఆకులోవుంచి కట్టవలయును

8. కుక్కపొగాకునూరి కట్టిన యెడల పురుగులు చచ్చును.

9. అన్నభేది నీళ్లను కడగవలెను.

10. వ్రణములో పురుగులు ఏమియుకేనట్లు తోచిన యెడల ఆవునేతితో జాజికాయ చూర్ణమును కలిపి పూయవలెను.

11, పాతసున్నమును పెరుగుమీాది తేటతోనూరి లేపనము చేసిన తైలదగ్ధ వ్రణము మానును.

12. బియ్యముకాల్చి భస్మమును నువ్వుల నూనెతోఁ జేర్చి మాటి మాటికి రాసిన అగ్నిదగ్ధ వ్రణములు శీఘ్రముగ నివర్తించును.

13. శీతాఫలపు ఆకును, హారతి కర్పూరమును, కొంచెము పుగాకు వేసి నూరి వ్రణముపై కట్టుచుండిన లోని పురుగులు చచ్చి మానును.

# వెంట్రుకలు ఎదుగుట

1. మంచి నూనెలో నీలిమందు కలిపి పూయు చుండవలెను.

2. కొబ్బరినూనె, మందార పువ్వుల రసము సమ భాగము కలిపి సన్నని మంట పెట్టి రసము ఇగురు వరకు కాచి తలకు పూసుకొను చుండవలెను.

3. ముసాంబ్రము తలకు పూసిన వెంట్రుకలెదుగ జేయును.

4. ఒక పండెము ప్రతి దినము రేగు ఆకులు మెత్తగా నూరి తలకు రుద్దుకొని స్నానము చేయవలెను.

5. రెండు వంటల సారాయిలో ముసాంబ్రమును కలిపి వెంట్రుకలకు పూయవలెను.

6. నీరుల్లిపాయను తలపై రుద్దుచుండిన వెంట్రుకలు ఊడుట తగ్గును.

7. జిల్లేడు పాలను కొబ్బరినూనెలో కలిపి రాసిన వెంట్రుకలూడుట పోవును.

8. నీళ్లలో పొగాకును వేసి పిసికి తలకు రాయుచుండిన వెంట్రుకలు రాలుట తగ్గును.

# వెంట్రుకలు నల్లబడుటకు రంగు

1. సీసముతో కల్వము, అందున నూరేది చేయించి తమలపాకులలో వేసుకొనే సున్నము. బొట్టు పెట్టుకునే సుద్దా యీ రెంటిని సమ భాగములు పై కల్వములో వేసి నీళ్ళు పోసి మొత్తముగా నూరవలెను. అటుల వక పావుగంట రమారమి నూరగానే అది నల్లగా కిలమువలె అవును, వల చగా కాకుండ చిక్కగా కాకుండ జిగటగా ఉండేటట్టు నూర వలెను. సదరు గింధమును వెంట్రుకలకు కుదురంట బాగుగా రాచుకొని రోజూ వాడుకొనే దువ్వెన్న గాక వేరు దానితో దువ్వుకొని అటుల రాచిన వెంట్రుకల పైని తమల పాకు గాని, ఆముదపు ఆకులుగాని వేసి ఒక గుడ్డ వేసి కట్టి రాత్రిపూట అయిదారు గంటల సేపు అలా వుంచిన యెడల నల్లగా అగును. నెల రోజుల వరకు నలుపు పోదు. దీని ఎప్పటి కప్పుడు తయారు చేసు కొనవలెను.

## కగ (పచ్చ)

1. మున్నవు నీళ్ళు, కానుగ వేరు రసము, కొబ్బరి పాలు సమ భాగములు కలిపి యివ్వవలెను.

2. జీడి గింజలు, నువ్వులు, పాత బెల్లము లేక తాటి బెల్లము, కొబ్బరి ఇవన్నియు సమ భాగములు నూరి పూటకు అర తులము చొప్పున మూడు పూటలు పుచ్చుకొన వల యును. పులుసు పనికిరాదు.

3. రాచ ఉసిరిక వేరు రసములో పంచదార వేసి పుచ్చుకొను చుండిన తగ్గిపోవును.

4. ఏలకులు, గుగ్గిలము సమ భాగములు చూర్ణము చేసి పూటకు పావు తులము చొప్పున చీనా పంచదారతో పుచ్చుకొనేది.

5. రత్నపురుష, మిరియాలు సమ భాగములు నూరి పూటకు పావు తులము చొప్పున సేవించేది.

## ఎఱ్ఱసెగ

1. తెల్ల కవిరి, బెల్లము నూరి పది దినములు పుచ్చుకొనిన తగ్గిపోవును.

2. ఏలకులు పావు తులము, జాజికాయ పావు తులము చల్లలో నానవేసిన సబ్జాగింజలు అర తులము, పంచదార అర తులము వీటి నన్నిటిని నూరి పూటకు పావు తులము చొప్పున పుచ్చుకొనిన తగ్గిపోవును.

## వెర్రికుక్క, నక్క కాటు

1. బలురక్కసి వేరు, పుత్ర్యోత్త వేరు, బెల్లం యివి నూరి పూటకు గచ్చకాయంత రెండు పూటలా 6 రోజులు యిచ్చేది. ఆవు, చల్ల, అన్నం తప్ప ఏమియు పెట్టరాదు.

2. నూనె, తెలగపిండి, బెల్లం, జిల్లేడు పాలు యివి సమం కల్పి యిచ్చేది.

3. దుష్టపువేరు, మిరియాలు, నూనె, నెయ్యి కలిపి త్రాగిన కుక్క, నక్కల విషము పోవును.

4. ఉత్తరేణి చెక్క రసం తేనెతో యిచ్చిన పిచ్చి కుక్క, నక్కల విషముతగ్గును. యీరొని కోడిరెట్ట కాటు మీాద వేసేది.

# తెల్ల సెగ

1. గవ్వ సాంబ్రాణి చూర్ణమును పూటకు నాలుగు చిన్నముల చొప్పున కలబంద రసముతో గాని నీటిలో గాని వంచదార నీటిలోగాని పుచ్చుకొనిన తగ్గిపోవును.

2. ఏలకులు, లవంగములు, చలవ మిరియములు వాయు విడంగములు సమ భాగములుగ చూపించి పూటకు పావు తులము చొప్పున వక తులము వంచదారతో పుచ్చుకొనిన తెల్ల సెగ తగ్గిపోవును.

3. బలురక్కసి వేళ్ళ రసము, చీనా వంచదార కలిపి కరిన వత్స్యముతో ఇచ్చిన సమస్త సెగలు, కుసుమ మొదలయినవి హరించును.

4. ఏలకులు, గుగ్గిలము సమ భాగములు చూర్ణము చేసి పూటకు పావు తులము చొప్పున చీనా వంచదారతో పుచ్చుకొనేది. ఆవ, కారము, ఎక్కువ పులుపు వేడి పదార్థములు వర్జితం.

5. పచ్చగా నుండు గవ్వలను కాల్చి చూర్ణము చేసి పూటకు 1/4 తులము చొప్పున రెండు పూటలా చక్కెరతో పుచ్చుకొనేది.

## శూలలు

1. శొంఠిని పొడిచేసి నువ్వులు, బెల్లము తొక్కిన దానిలో కలిపి దానిని ఆవుపాలలతో కలిపి పుచ్చుకొనిన సర్వ విధ శూలలు హరించును.

2. వెల్లుల్లి పాయల రసమును, శొంఠిచెము తేనెతో

కలిపి పుచ్చుకొనిన అసాధ్యములగు పరిణామ శూలలు కుదురును.

3. ఉప్పు కలిపిన పెరుగుతో నువ్వులపిండి కలిపి పుచ్చుకొనిన అన్నమును వర్జించిన పరిణామ శూలకూడ తగ్గిపోవును.

4 ఉప్పునుగాని శంఖు భస్మమునుగాని వేడి నీళ్ళతో పుచ్చుకొనిన తగ్గిపోవును.

5. ఉప్పు వేయకుండా ఎండు మిరపకాయలను నూరి రెండు కరక్కాయల ఎత్తు పరిమాణమున పరగడుపున తినుచుండిన తగ్గిపోవును.

6. వాము, సైంధవ లవణము, కరక్కాయ, శొంఠి వీనిని సమ భాగములుగ చూర్ణించి సేవించిన సర్వ శూలలు హరించి అగ్నిదీప్తి కలుగును.

## శోభి

1. తులసి ఆకు రసమున మిరియములు నూరి పట్టించుచుండిన శోభి తగ్గిపోవును.

2. నిమ్మరసము, కొబ్బరినూనె సమ భాగములు కలిపి రాయుచుండ వలెను.

3. వంటి గంధము, హారతి కర్పూరము కలిపి రాయుచుండ వలెను.

## శరీర దుర్గంధము

1. మామిడిఫల రసములో తేన లేక నెయ్యి కలిపి ప్రతి ఉదయము సాయంకాలమును పుచ్చుకొనుచు తంగేడి పువ్వును

మున్నిపిండితో కలిపి నలుగు పెట్టుకొనుచు వేన్నీళ్ళతో స్నానము చేయుచుండిన పోవును. పప్పు దినుసులు వర్జితం

## షండత్వము

1. ఉసిరిక వరుగును చూర్ణించి ఉసిరికాయల రసముచే 21 సారి భావనచేసి (ఒక్క రోజు నూరి ఎండకొట్టి మరునాడు తిరిగి మర్దించి) ఎండ తగులకుండా ఎండించి దీనికి సమానము పటికబెల్లపు పొడిని జేర్చి తేనెతో పూటకు అరతులము వంతున రెండు పూటలా పుచ్చుకొనుచు ఆవెంటనే పాలు త్రాగవలెను. ఇటుల చేసిన వృద్ధులు సైతము యౌవనులతో సమాన మగుదురని "చక్రదత్తము" నందు వ్రాయబడెను.

2. కుంకుమ పువ్వు రెండు భాగములు, నల్లమందు మూడు భాగములు. కస్తూరి ఒక భాగము, జాజికాయ తొమ్మిది భాగములు, లవంగములు ఆరు భాగములు. వీనిని చక్కగా చూర్ణించి తేనెతో మర్దించి, కందులవలె మాత్రలను జేసి రాత్రులందు క్షీరములతో బుచ్చుకొనిన బహుమంది స్త్రీలతో భోగించు శక్తి గలుగుటయేకాక, నపుంసకత్వము నివారించును అని "వైద్య కుతూహలము"లో వ్రాయబడియెను

3. తామర గింజలను సన్నగా నూరి తేనెను కలిపి నాభికి లేపన మొనరించిన వీర్యస్తంభన మగును.

## సవాయి

1. చిత్రమూలములు రెండు తులములు, తెల్లజిల్లేడు చెక్క రెండు తులములు, ఫిరంగిచెక్క నాలుగు తులములు

వీటిని చూర్ణించి పూటకు పావుతులము చొప్పున తేనెతో పుచ్చుకొనిన అన్ని సవాయిలు హరించును. (ధన్వంతరి)

2. ఉసిరికచెక్క, లవంగాలు, మిరియాలు, పిప్పళ్ళు, వీనిని సమభాగములుగ నీటితో నూరి యిండుపు గింజలంత మాత్రలుచేసి, పూటకు ఒకమాత్ర చొప్పున పుచ్చుకొనిన యెడల అంగముచుట్టు కురుపులువేసినట్టి సవాయి తగ్గిపోవును.

3. మిరియాలు, బలురక్కసి, అల్లము వీటిని నూరి పూటకు గచ్చకాయంత పుచ్చుకొనవలెను.

4. గంధకము, కొంచెము మైలతుత్తమును వెన్నలో కలిపి పుండ్లకు పూయవలెను.

5. పసుపు, పోవచెక్కలపొడి, తెల్లకాసు వీటిని నూరి కురుపులపైన చల్లుచండవలెను.

## సుఖప్రసవము

1. పిప్పళ్ళు, వస నీటితో నూరి భగమునకు లేపన మొనర్చిన సుఖ ప్రసవ మగును. "ఆ నూరినదానిలో ఆముదమును కలిపి బొడ్డుపై లేపన మొనర్చిన కడు ప్రమాదస్థితిలో నుండు స్త్రీకూడ ప్రసవించును". వీటిని వేరు వేరుగ జేయనగును.

2. మాదీఫలవు వేరు, అతి మధురము, వీటి చూర్ణమును నేతిలో కలిపి త్రాగిన స్త్రీ సుఖముగా ప్రసవించును.

3. ఉత్తరేణి వేరును యోనియందుంచుటచేత సుఖ ప్రసవ మగుదురు.

4. శొంఠి, వెల్లుల్లి నూరి నీళ్ళతో లోపలికి పుచ్చుకొనిన యెడల చచ్చిన పిండమైనను వెలికి వచ్చును.

5. పత్తి ఆకు రసము, పాలలో కలిపి పుచ్చుకొన వలెను.

## సన్నిపాత జ్వరములు, సంధి

1. ఆముదపు గింజల పప్పు, యింగువ సమంచేసి నిమ్మ రసంతో మర్దించి కళ్ళకుంచేది.

## సూతిక

1. తిప్పతీగ, శొంఠి, ములుగోరింట, వావిలి, లవంగ పట్ట వీటి కషాయమును త్రాగించిన, తత్క్షణమే సూతికా రోగము హరించును.

2. ముషిణి గింజలను వేయించి పొడిచేసి శొంఠియు మిరియపుపొడి, కరక్కాయ పొడిని కలిపి తేనెతో యిచ్చేది.

3. గోరోజనము శొంఠియు ఆముదములో కలిపి ప్రతిరోజును యివ్వవలెను.

4. ఆముదపు గింజలను గుడ్డతో మూటగట్టి పొత్తికడుపు కాచవలెను,

5. నీలివేళ్లు, దాచినచెక్క, తుంగముస్తలు, చిత్రమూలము తులము చొప్పున ఏబయి తులముల నీళ్లలో వేసి యెనిమిదవ వంతుకు మరగనిచ్చి, రోజూ సుప్రొద్దూ యివ్వవలెను.

## సంతాన నిరోధము

1. పచ్చి తమలపాకులు వట్టివి మిరియాలతో తినుచుండిన గర్భము గలుగదు. ఆరాత్రికూడి తినవలెను.

3. తమలపాకు రసమును ఆ సమయమున యోనిలో పోసిన గర్భము నిలవదు, కాదు.

# సమస్త విషములు

(లోనికి తీసిన వస్తువుల విషము.)

1. వచ్చిపసుపు చూర్ణమును గోమూత్రముతోగాని, పాతనేయితోగాని కలిపి త్రాగవలయును. (అవనూనె పప్పు దినుసులు మొదలగునవి కొంతకాలము వర్జితం)

2. పంచదార నీళ్ళను తరుచు త్రాగుచుండవలెను.

# సాలెపురుగు కాటు

1. పసుపును చన్నీళ్లతో నూరి మర్దన చేయవలెను.

# స్త్రీ సంగమ దోషము

1. మిరియాలను నల్లి నెత్తురును తమలపాకు రసముతో మర్దించి కలికము వేసిన సంగమ దోషము హరించును

2. వాముపొట్టు, వెల్లుల్లి, వెలిగారము, తమలపాకులు, ఇంగువ, ములగమొగ్గలు, కుంకుమ, పోకచెక్కలు వీనిని సమ అంశములుగ జిల్లేడువేరు రసమున మర్దించి మూడుచిన్నముల యెత్తు మాత్రలుచేసి పూటకొకటి చొప్పున సేవించిన దారుణమగు సంగమదోషము హరించును. (ధన్వంతరి)

# క్షయ

1. ఉసిరికాయల పరుగును వాడుచుండవలెను. ఎండించిన చూర్ణమును తేనెతో కలిపి లోపలికి పుచ్చుకొనవలెను.

2. యష్టిమధుకము చూర్ణమును నాలుగు చిన్నముల యెత్తు చొప్పున రోజుకు రెండుపూటల పుచ్చుకొని ఆవుపాలు త్రాగుచుండిన యెడల క్షయ తగ్గిపోవును.

3. వేపనూనెను పైన వ్రాయుచు, లోనికి 20 చుక్కలు మొదలు 60 చుక్కలవరకు పంచదారపై వేసి, రోజుకి రెండు పూటలా పుచ్చుకొనవలెను. వప్పాదినుసులు వర్జ్యం.

4. వేపచెట్టుక్రింద కాపురముండి, వేపసంబంధ మెక్కువగ వాడవలెను. ఇటు 12 సంవత్సరములు చేసిన యెటువంటి మొండికుష్టుకూడ నివర్తించును.

5. ముసురు వేపచెట్టు పగిలి కారు సొనను ప్రతిరోజును పుచ్చుకొనుచుండవలెను.

6. చక్కరకేళీ అరటిపండు బాగుగా పండినది తొక్కతో తినవలెను.

7. ఆవుపాలు 40 తులములు, నువ్వులనూనె 10 తులములు, యష్టిమధుకము 1 తులము యివి కలిపి, తైలపాకము కాచి, పూటకు మూడుతులముల ముప్పొద్దూ యివ్వవలెను. తైలమును అప్పుడప్పుడు ముక్కులో వేసి పీల్చుచుండవలెను.

8. తిప్పతీగ కషాయము రెండుపూటల యివ్వవలెను.

9. ఆవుపాలు కాచి, అందులో మిరియపు చూర్ణము వేసి, రాత్రి పరుండునపుడు దాహము యివ్వవలయును.

10. ప్రతిరోజు ప్రాతఃకాలమునను ఆవు పాలతో ఒకటి మొదలు కొన్ని గుడ్లువరకు పుచ్చుకొని చిన్న జీవసాధన వ్యాయామము చేయవలయును.

11. కొబ్బరినూనెను నఖ, శిఖ పర్యంతము పట్టించి యెండలో వుండవలెను. తరువాత కుంకుడుకాయతో గాని, శీకాయతో గాని కొద్దిపాటి వేడి లేక శీతలోదకమును దేశకాల పరిస్థితులనుబట్టి స్నానము చేయవలెను.

---

Printed at the Manjuvani Press, Eluru.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA110B104 |
| పుస్తకం పేరు | తెలుగు గద్ద |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 125 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2B |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ch. Ramya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |